సెప్టెంబర్ 1973

48

# సృజన

ఆధునిక సాహిత్య వేదిక



నిర్వహణ

'సాహితీ మిత్రులు'

# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

మాసపత్రిక

48

సెప్టెంబర్ 1973

నిర్వహణ

'సాహితీ మిత్రులు'

64 పేజీలు 1 రూపాయి

ఆగస్ట్ 24 నుంచి 28 వరకు జరిగిన జనచైనా కమ్యూనిస్టుపార్టీ 10 వ మహాసభ నూతన రాజ్యాంగం జనచైనాలో జరిగిన సాంస్కృతిక విప్లవాన్ని సమర్థిస్తూ "ఇలాంటి విప్లవాలు భవిష్యత్తులో యింకా చాల సార్లు కొనసాగించాల్సివుంటుంది' అన్నది. నవచైనా వార్తాసంస్థ ప్రచురించిన పదవ కాంగ్రెస్ ఆమోదించిన నూతన రాజ్యాంగం"సాంస్కృతిక విప్లవం ఘనవిజయాలను, అద్భుతమైన ప్రాముఖ్యాన్ని పూర్తిగా ధృవపరుస్తుంది."

ఈ రిపోర్ట్ ఆగస్ట్ 24వ తేదీన పదవమహాసభకు వాంగ్ హుంగ్-వెన్ సమర్పించాడు. ఆయన వయస్సు 35 సంవత్సరాలకు మించి వుండదు. ఆయన పార్టీ నూతన ఉపాధ్యక్షుడుగాకూడ ఎన్నికయ్యాడు. సాంస్కృతిక విప్లవం నిర్వహించిన యువకార్యకర్తల్లో వాంగ్ హుంగ్-వెన్ ముఖ్యుడు.

స్వయంగా చేర్మన్ మావో నాయకత్వంలో నిర్వహించబడిన కార్మికవర్గ మహా సాంస్కృతిక విప్లవం "లిషా-చి నాయకత్వంలోవున్న బూర్జువా ప్రధానకేంద్రాన్ని ఒకవైపు, లిన్‌పియావో నాయకత్వంలో ఉన్న బూర్జువా ప్రధాన కేంద్రాన్ని యింకొకవైపు తుడిచిపెట్టేసింది." "సామ్రాజ్యవాదం సోషల్ సామ్రాజ్యవాదం బయటనుంచి తప్పకుండా మన పార్టీలోకి ఏజంట్లనుపంపి లేదా మన పార్టీలోనే ఏజంట్లనుతయారు చేసి మనకు వ్యతిరేకంగా దురాక్రమణను, అణచివేతను చేపట్టే ప్రమాదం ఉన్నది కనుక" కొత్తగా సాంస్కృతికవిప్లవాల అవసరం ఏర్పడుతుంది. 1966లో సాంస్కృతిక విప్లవం ప్రారంభమయ్యేదశలో చేర్మన్ మావో అంచనా వేసినట్లు అమానుషులు, రాక్షసులు "(Monsters & demons)" తరచుగా పుడుతూనే వుంటారుగనుక ప్రతి ఏడు, ఎనిమిది సంవత్సరాలకు ఒకసారి ఈ విప్లవాలు అవసరం అవుతూనే వుంటాయి.

# సాంస్కృతిక విప్లవాల పరంపర

మార్క్సిజాన్ని ఆచరించండి— రివిజనిజాన్ని కాదు. ఐక్యం కండి— విడిపోకండి. స్పష్టంగా సూటిగా ఉండండి— కుళ్లగా కుట్రగా కాదు. "(Practise, Marxism and not Revisionis n– Unite and don't split- be open and above board and don't intrigue and inspire)"అనే మావో సూక్తి ఒకటి నూతనరాజ్యాంగంలో చేర్చబడ్డది. ఈ సూక్తి పార్టీ సభ్యులందరిని నడుపుతూ లిషా, చి, లిన్‌పియావోవంటి కుట్రదారుల, రెండునాల్కలవాళ్ళ పెట్టుబడిదారీ పంథాలో నడిచేవారి "(Conspirators, double dealers and Capitalist roaders)" ముసుగులు తొలగించడానికి తోడ్పడుతుంది అని వాంగ్ హుంగ్-వెన్ అన్నాడు. "చైనా కృశ్చెవ్, రివిజనిజం యొక్క అపరావతారం" అయిన లిషా-చి 1968 అక్టోబర్‌లోనే ఆయన కున్న అన్ని పదవులనుంచి తొలగించబడ్డాడు.

"రాజకీయ, మిలిట్రి విషయాలలో మార్క్సిస్టు లెనినిస్టు పద్ధతి మన దూరదర్శిని, మన సూక్ష్మదర్శిని. నిజమైన కమ్యూనిస్టు ఏమాత్రం స్వార్థ పర ఆలోచనలులేకుండా వ్యవహరించాలి. ప్రవాహానికి ఎదురు యీదడానికైనా సాహసించాలి. పదవినించి తీసేస్తారనో, పార్టీనుంచి తీసేస్తారనో, జైల్లో పెడతారనో, బహిష్కరిస్తారనో, ఉరిశిక్ష వేస్తారనో, భయపడకూడదు." నూతన రాజ్యాంగం ప్రకారం "విమర్శను అణచివేయడంకాని ప్రతీకారం తీసుకోవడానికి ప్రయత్నించడంకాని పూర్తిగా అనుమతించబడదు."

"కార్మికవర్గం, పేద, కిందితరగతి, మధ్యతరగతి రైతులు, కష్టజీవులైన ప్రజలు- మన పార్టీ ప్రభుత్వ సంస్థలన్నిటిమీద, కార్యకర్తలందరిమీద, అవి ఏ స్థాయికి చెందినవైనా, వాళ్ళు ఏ హోదాకలవారైనా, వాటిమీద పర్యవేక్షణను నెరిపే హక్కుదారులు."

# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

1973 సెప్టెంబర్ | మాసపత్రిక | 48



ముఖచిత్రం :

చైనాలో సాంస్కృతిక విప్లవాన్ని చిత్రించే పోస్టర్



(గతసంచిక తరువాయి)

"నాను సెప్పాల్సింది అయిపోనాది. ఇంకా సెప్పాల్సినోళ్లు ముందుకు రండి." అన్నాడు చావో.

మీటింగు సందడిగా తయారయింది. హాన్ జట్టువాళ్లు అందరినీ జాగ్రత్తగా గమనిస్తున్నారు కానీ ఎవరూ వాళ్ళని పట్టించుకోలేదు.

"ఇంకెవరు మాట్లాడతారు ?" అన్నాడు లియూ షెంగ్ స్టేజీమీదినుంచి.

మరికొందరు బుగతని నిందించేక, ఓ యువకుడు ముందుకు వచ్చేడు. అతను ఓ చింకి గడ్డిటోపీ పెట్టుకున్నాడు. అతని చొక్కాకి రంగురంగుల గుడ్డలు రకరకాలుగా అతుకులు వేసి వున్నాయి. ఆ చొక్కా అసలు రంగు ఏఁవిటో చెప్పటం కష్టంగా వుంది. ఈ రంగుల చొక్కా యువకుడు ముందుకు వచ్చి, ఇలా అన్నాడు—

"వురేయి హాన్, నువ్వు జపానోళ్ళ అండసూసుకొని పేదోల్లని సితకపొడిసేసినావు! జపాన్ రాచ్చసులకన్నా నాలుగాకులు నువ్వే ఎక్కువ సదివినావు. ఓ సుట్టు* నాను నీకాడ కంబారిగా కుదురుకున్నాను. ఏడాది సివర్న నా కూలిగింజలు నాకు ఇప్పించమన్నాను. అంతకన్నా నానేటెక్కువ అడిగినాను ? కానీ నువ్వు ఇవ్వను పొమ్మనీసినావు. ఏటయ్యా అంటే, 'నా ఇష్టం' అన్నావు. రొండోనాడు నన్ను లేబరు సేంపుకి తోలీసినావు. దీనికేటంటావ్ ?"

* 1938 లో

"బుగతలు నశించాల! దగాకోర్లు నశించాల!!" అని అరిచేడు చిన్నవాంగ్. చాలా మంది అతనితో గొంతు కలిపేరు. జనం ఉత్సాహం పుంజుకున్నారు. కొందరు "వాణ్ణి నీతక పొడవండి," అని అరిచేరు. కానీ స్టేజి మరీ పైకి వుండటంవల్ల ఎవరూ అంతదాకా వెళ్ళలేదు.

హాన్ ఇంతసేపూ కాలుమీద కాలువేసుకొని, పొగ వదల్తూ, కదలకుండా కూచున్నాడు. చాలా గంటలుగా నల్లమందు లేకపోవడంతో పెద్దగా ఆవలిస్తున్నాడు. ఇప్పుడు చావో మాటలూ, చిన్నవాంగ్ నినాదాలూ వినటంతో అతని బూడిదరంగు ముఖం తెల్లగా పాలిపోయింది. అక్కడ కూచోలేనట్టుగా, అటూ ఇటూ ఇబ్బందిగా కదిలేడు.

'పొడుగుమెడ' హాన్ పక్కనే నించున్న ఓ పండుగెడ్డపు వృద్ధుడు, తోసుకుంటూ ముందుకు వచ్చేడు.

"నా మాట కూడా ఇనుకోండి." అన్నాడు.

అందరూ అతన్నే చూస్తున్నారు. కిందటి మీటింగుని నీళ్ల కాచ్చింది యితనే. ఇతనే 'తెల్లమేక'. ఇప్పుడు హాన్‌వంక అతనుకూడా వేలు చూపుతూ ఇలా అన్నాడు;

"కీలుబొమ్మ మంచుకో హయాంలో మామీద తెగ సెలాయించీసినావు. ఓపాలి* నా ఆడగుర్రాన్ని నీ సాలలో కట్టీసినాను. అది నీ మగగుర్రంతో తగువేసుకున్నాది. అప్పుడు నువ్వు ఏది తప్పుసేసిందో సూసినావా? అఁహఁ. నా గుర్రాన్ని కమ్చీతో కొట్టీసినావు. 'నీ గుర్రమేఁ మొదలెట్టినాది, నా గుర్రాన్ని కొడతావేటి?' అని అడిగేను. 'నీ గుర్రానికి నా సాలలో ఏటి పని? నీ యంమ...!' అన్నావు. నాను ఇప్పుడు అడుగుతున్నాను, నువ్వామాట ఎందుకనాల? నానూ అదే మాట అంటాను, నీకెలాగ వుంటాది? 'నీ యంమ...' "

"సరే, కానిమ్." అన్నాడు హాన్. హాన్‌తల్లి పదేళ్ళక్రితమే చచ్చిపోయింది. జనం గొల్లుమన్నారు. రెండు జట్లమధ్యా తీవ్రత తగ్గింది. హాన్‌కి మళ్ళీ ధైర్యం చిక్కింది. ఓ సిగరెట్టు ముట్టించేడు.

"హాన్ బాబూ, నువ్వు ఇంత మందిని బాదెట్టినావు కదా, మరేటి సేస్తావు?" అన్నాడు 'తెల్లమేక'.

"మీరేవంటే అదే చేస్తాను," అన్నాడు హాన్, పొగ వదుల్తూ.

---

* 1938 లో

"నువ్వే సెప్పు, ఏటి సేస్తావో." అన్నాడు 'తెల్ల మేక', కోపం నటిస్తూ.

"నన్నడిగితే, ఇప్పుడు మనవాళ్లు చెప్పిన వాటన్నిటికీ నా తమ్ముడే కారణం అంటాను. కానీ నేను తెలిసి తప్పుచేస్తే, దాన్ని తప్పకుండా దిద్దుకుంటాను."

"అయితే, నీ తమ్ముడు ఎక్కడున్నాడేటి ?"అన్నాడు 'తెల్ల మేక', జనందృష్టి హాన్ మీదినించి తప్పిస్తూ.

"వాడు 'తాచింగ్' కొండల్లో వున్నాడు. మీరు వాణ్ణి పట్టుకుంటే మా కుటుంబా నికి ఎంతో మేలుచేసినవాళ్లవుతారు. మీరు వాణ్ణి చంపుతారో, నరుకుతారో, జైలుకే పంపుతారో, అదంతా మీ ఇష్టం." అన్నాడు హాన్.

"ఆ బందిపోటోడి సంగతిసరే, మరి నీ సంగతేటంటావ్ ?"అని అరిచేడుచావో.

నా తప్పులు ఏవన్నా వుంటే ఎత్తి చూపండి. శిక్ష అనుభవిస్తాను. నాకు అం దరికన్నా నాలుగైదు ఎకరాలు ఎక్కువున్నమాట నిజమే. అయితే భూసంస్కరణదళం వాళ్ళు రాకముందే అదంతా మీకు ఇచ్చేద్దామనుకున్నాను."

"మాకు ఎన్ని ఎకరాలు పంచుతావేటి ?"అని 'తెల్ల మేక' అందించేడు.

"మా ముత్తాతలు చెమటోడ్చి సంపాయించింది ఏడు వందల ఎకరాలు. అందు లో ఐదొందల ఎకరాలు మీకు ఇచ్చేస్తాను. మీకు ఇష్టమైతేనే మిగిలిన రెండు వందల ఎకరాలూ వుంచుకుంటాను— మరి పది కడుపులు నిండాలికదా. మనందరం ఒకేవూరి వాళ్ళం కాబట్టి మీరూ మా కడుపులు చూడాలి అనుకోరు."అన్నాడు బుగత.

గండు పిల్లిలాంటి బుగతే పొలం తనంత తానై ఇచ్చేస్తుంటే, జనం మెత్త బడ్డారు.

వాతావరణం బాగుంది. ఎవరిమట్టుకు వాళ్ళకి పొలం పనులు గుర్తొస్తున్నాయి. హాన్ జట్టువాళ్ళంతా అదను కనిపెట్టి, అతన్ని వెనకేసుకొచ్చి మాటాడేరు.

"మనకంటే భూఁవి ఓ పిసరు ఎక్కువ వుందిగానీ, ఆయనకేం, మారాజు." అన్నాడో వేలువిడిచిన తమ్ముడు.

"కీలుబొమ్మ ప్రభుత్వంలో అతను అనుకోకుండా పెత్తందారు అయేడు. దానికి అతన్ని ఎలా తప్పుపట్టగలం ?"అన్నాడు ఓ స్నేహితుడు.

"ముందు ముందు బాగుంటానన్నాడుకదా, ఇక వొదిలేస్తే పోలే ?" అన్నాడు మరో బీరకాయపీచు.

"ఐదువందల ఎకరాలు పంచుతున్నాడు, బాగుంది. మరి గుర్రాల సంగతో? చాలా వున్నాయి, రెండు-మూడు ఇవ్వకూడదూ?"

హాన్ టక్కున అందుకున్నాడు:

"సరే, ఐదు గుర్రాలు ఇచ్చేస్తున్నాను."

"అబ్బో, జీవాలుకూడా పంచుతున్నాడే!" అన్నాడు మరో బంధువు.

"నీకు గుడ్డలు శానా వున్నాయికదా, మరయితే అవి పంచవేటి?" అన్నాడు 'తెల్ల మేక'.

"సరే, మీరన్నట్టే కానివ్వండి. నాదోకోటూ, రెండు సిల్కుపంచెలూ, నాపెళ్లాం సిల్కు చీరా తీసుకోండి."

"సియావోగారూ," అన్నాడు 'తెల్ల మేక', చేతులు జోడిస్తూ. "హాన్‌బాబు గొడ్డూ గోదా ఇచ్చీసిందుకు 'రడీ'గున్నాడు కదా, మీరు వొల్లకున్నారేటి? ఇకనైనా ఇడిసీసీరా? ఆ బాబుని మాకు ఒగ్గెయ్యండి. మల్ల ఏదేన తప్పు సేసినాడా, సిటంవలో మీకాడ వుంచుతాం. ఏటంటావ్ బాబూ?"

సియావో నోరు మెదపలేదు. ఈసరికే అతనికి 'తెల్ల మేక' నైజం అర్థమైంది. నిరాశ చెందినవాళ్లు వెళ్ళిపోయేరు. కొందరికి హాన్ బూటకం అర్థమయినా, ఎత్తి చూపే ధైర్యం లేకపోయింది. మరికొందరు అమాయకులు హాన్ చెప్పిందంతా నిజమే నని నమ్మి, అతన్ని క్షమించేసేరు.

ఓల్డ్‌సన్ వెళ్ళిపోయేడు. తీన్‌తాత గోడవారగానే తల దించుకు కూచున్నాడు. లియూ తెషాన్, సన్నకారు రైతు, 'పొడుగు మెడ' హాన్‌తో ఇలా అన్నాడు:

"ఆ బాబు అనుకోకుండా పెత్తందారయేడు. అది ఎవరు కాదనగలరు? కీలు బొమ్మ పెబుత్వంకింద కూడా ఏంవి ఇదిగా వుండీవోడు!"

"ఆణ్ణి వొట్టుకు బాదెయ్యాల," అన్నాడు చావో, చిన్నవాంగ్‌తో.

"ఎవరా 'వాడు'?" అన్నాడు చిన్నవాంగ్.

"ఆడే, 'తెల్ల మేక'. హాన్‌కి వొరసకి తమ్ముడవుతాడు." అంటూ చావోతుపాకీ కాళ్ళసందున నిలబెట్టి, గోడవారగా జేరగిలబడ్డాడు.

అప్పటికే బాగా పొద్దెక్కిపోయింది. సియావో 'వాన్'తో లియూషెంగ్‌ని మీటింగు ముగించమని చెప్పమన్నాడు. హాన్‌ని విడిచిపెట్టేసేడు.

హాన్ స్టేజీదిగి, ఒకపక్క పెళ్ళాం, మరోపక్క వుంపుడుగత్తెతో, మొత్తం జట్టుని తీసుకొని బైటికి నడిచేడు.

చిన్నవాంగ్ మండిపడ్డాడు కోపంతో నరనరం వుడుకెత్తిపోయింది. సియావోని "అసలు వాడిని ఎందుకు వొదిలేసేరు ?"అని అడిగేడు.

"ఇంకేం చెయ్యగలనంటావ్ ?"అన్నాడు సియావో. చిన్నవాంగ్ కోపం నెమ్మదిగా తగ్గిద్దామని. కానీ తీన్‌తాత వెళ్ళిపోవటం చూసి, అతనివెంట పడ్డాడు. "నిన్ను మళ్ళీ కలుసుకుంటాను "అన్నాడు సియావో తీన్‌తాతతో.

జనం అంతా వెళ్ళిపోయేక ఆ ఖాళీ ఆటస్థలం—మధ్య స్టేజీ, దిక్కుమాలినట్టుగా వున్నాయి.

ఆ సాయంత్రిం స్కూలుదగ్గరకి లీచింగ్-షాన్ ఐదు గుర్రాలూ, మూడు గుడ్డ ముక్కలూ తీసుకువచ్చాడు.

"హాన్‌బాబు ఇచ్చేస్తానన్న ఐదువందల ఎకరాలూ వూరి పొలిమేరలోవున్నాయి. ఎప్పుడైనా పంచుకోవచ్చు." అన్నాడు.

మర్నాడు సియావో తీన్‌తాత ఇంటికి వెళ్ళేడు. కానీ అతను లేడు. కాంగ్ మీద కూచున్న ఓ గుడ్డిముసిలావిడ తీన్‌తాత పొలం వెళ్ళేడని చెప్పింది.

సియావో స్కూలుకి తిరిగివచ్చేసరికి హాన్ బట్టలూ, గుర్రాలూ ఎలాపంచటమా అని అనుకుంటున్నారు లియూషెంగ్, చావో. ఎంతో ఆలోచించేక, చివరికి వాటిని చాలా అవసరం వున్నవాళ్ళకి పంపేరు. కానీ అవి వెంటనే తిరిగొచ్చేయి. ఓల్డ్‌సన్ కూడా ఓ ఆడగుర్రాన్ని తిప్పి పంపేసేడు.

"ఏం ? ఎందుకు తీసుకోవు ? భయమా ?"అన్నాడు సియావో ఓల్డ్‌సన్‌తో.

"ఛస్, నాకేటి బయ్యంనేదు. కానేటి, ఆడగుర్రాన్ని ఎట్టుకున్నాక వొల్లకూసోటవంటే మాటలేటి ? దానికి గడ్డీగాదం కోసుకురావాల, మద్దిరేతిరి లేచిమేపాల. ఈ ముసిలోడికి అయన్నీ సేతనౌనా ? అఁహఁ, నా కాళ్లుకూడా బాగునేవు బాబూ." అంటూ బుకాయించేడు ఓల్డ్‌సన్.

బట్టలూ, గుర్రాలూ, తెచ్చినవితెచ్చినట్టే స్కూల్లో వుండిపోయేయి. కొందరు ప్రస్తుతం వాటిని స్కూల్లోనే వుంచుదామన్నారు గాని, సియావో ఒప్పుకోలేదు.

"అవన్నీ మనకి దేనికి ? హాన్‌కే తిప్పిపంపుదాం"అన్నాడు.

చావో వెళ్ళిపోగానే లియూషెంగ్ పెట్టేబేడా సర్దుకోసాగేడు.

"ఏఁవిటి చేస్తున్నావ్ ?"అడిగేడు సియావో.

"నేను పోతున్నాను," అన్నాడు లియూషెంగ్, ఇంకా సర్దుతూనే. అతను కళ్ళద్దాలలోకి చెయ్యిపెట్టి తుడుచుకున్నాడు— మరది చెమటబిందువో, కన్నీటి చుక్కో!

"ఎక్కడికి పోతున్నావ్?" అన్నాడు సియావో.

"హార్బిన్‌కే. ఇదిలా జరగటం మొదటిసారికాదు. ఇక నేను భరించలేను. నేను ఇక్కడి జనంతో కలిసి పనిచెయ్యడానికి వచ్చాను గానీ, ఇలా ప్రతీసారీ భంగపడటానికి కాదు."

సియావో విరగబడి నవ్వేడు.

"నువ్వు 'హార్బిన్'లో ఏం చేస్తావు? పల్లెటూళ్ళో బాగా పనిచెయ్యకపోతే, హార్బిన్‌ని ఎలా దక్కించుకుంటావు? ఆ పట్టణాన్ని దక్కించుకోలేకపోతే ఎక్కడికి వెళ్తావు?"

"ఇంకా తూర్పు దిక్కుకి, మరింత దూరం వెళ్తాను— వుసూ్సరి నది వచ్చేంత వరకు."

"అంతా సాఫీగానే ఆలోచించేవు" అన్నాడు సియావో. "నీ బాగు నువ్వు చూసుకోగలవు" అని అందామనుకున్నాడు కానీ, లియూ మరీ బాధపడతాడని వూరుకున్నాడు. లియూషెంగ్‌లాంటి పెటీబూర్జువాలు చాలామంది విప్లవంలో జేరటం చూసేడుసియావో. వాళ్ళకి చాలా మంచి వుద్దేశాలే వుంటాయి. కానీ ఆవేశం పాలు ఎక్కువ. తొందరగా నీళ్ళుగారిపోతారు. వాళ్లు విజయాల్ని సాధించగలరు, కానీ అపజయాలను ఎదుర్కోలేరు. ఏదైనా సవ్యంగా జరగకపోతే, నానా హైరానా పడిపోయి, డీలా పడిపోయి, తప్పుదోవలో పడతారు. అందుకే సియావో లియూషెంగ్‌ని గంభీరంగా అయినా, శాంతంగానే వారించేడు:

"కాదు కామ్రేడ్. నువ్వు అనుకున్నదంతా తప్పే నీ మానాన నువ్వు హాయిగా వెళ్ళిపోతావు. సరే. కానీ ఇక్కడి జనం ఏమవుతారు? మళ్లీ ఏ చియాంగ్ కై షేకో, ఏ అమెరికా సామ్రాజ్యవాదులో ఇక్కడ కీలుబొమ్మ ప్రభుత్వం నెలకొల్పి, జనాన్ని తమ గుప్పెట్లో పెట్టుకుంటారు.

"వుద్యమాల్లోనూ, విప్లవాల్లోనూ విజయం సాధించాలంటే వాటిని ఓపిగ్గా అంటిపెట్టుకొని వుండటం ఒక్కటే మార్గం. జనం ఎండుగడ్డి పరకలు కాదు— ఓ అగ్గిపుల్ల పడేసి మండించడానికి. అసలు మనం ఇక్కడ ఎన్నాళ్లు వున్నాం? నాలుగు పగళ్లూ, నాలుగు రాత్రులూ. కానీ ఇక్కడి ప్రజలు ఎన్నాళ్ళనుంచి అణగారి వున్నారు? ఒకటీ, రెండూ కాదు, వేలకొద్దీ సంవత్సరాలు తెలుసా?" అని ఆగేడు.

అతనికి ఓ చిన్న బలహీనత వుంది— తన మాటలకి తనే వుద్రేకపడతాడు. ఇప్పుడు గొంతు కొంచెం అడ్డుపడింది. అతను విషయం మార్చడానికి తొందరపడ్డాడు:

“సరే, బాగా ఆలోచించు. నువ్వు తప్పకుండా హార్బిన్ వెళ్ళాలంటే మేం ఆపలేం. హార్బిన్‌లో నువ్వు ఏ పనీ చెయ్యకపోతే ఇంకా కష్టాలు ఎదురౌతాయి. ఎక్కడైతే పని వుంటుందో, అక్కడ కష్టాలు వుండకపోవు. విప్లవకార్యాచరణ అంటే లెక్కలేనన్ని కష్టాలని ఎదుర్కోవటం కాక మరేవిటి?”

లియూషెంగ్ మాటాడలేదు కానీ, సర్దుడు ఆపేడు.

ఉన్నట్టుండి, చిన్నవాంగ్ కనిపించటల్లేదన్న సంగతి సియావోకి తట్టింది. అతన్ని వెతుకుతూ బైటికివెళ్ళేడు. చిన్నవాంగ్ స్కూలు దగ్గరలో ఓ గుడిసెబైట గడ్డివాముకి ఆనుకొని నిలబడి వున్నాడు. అతను జనంమీదా, 'తెల్లమేక'మీదా, ఆఖరికి సియావో మీదకూడా మండిపడుతున్నాడు.

“అసలు అతను హాన్‌ని ఎందుకు వదిలెయ్యాలో అర్థంకావటల్లేదు. అతను పార్టీ ఆదేశాల్ని* పాటించటల్లేదు. ఒకవేళ అతనుగాని బుగతలతో లాలూచీ పడుతున్నాడా?” సియావో కనిపించగానే, చిన్నవాంగ్ తల తిప్పేసుకున్నాడు.

“ఇక్కడ ఏం చేస్తున్నావ్?”అన్నాడు సియావో, అతనిపక్కనేకూర్చుంటూ.

చిన్నవాంగ్ సియావోని 'కామ్రేడ్'అనో, 'సియావో'అనో కాకుండా దళనాయకుడిగా సంబోధించి, ఇలా అన్నాడు:

“ఆ మనిషిని ఎందుకు విడిచిపెట్టేవో నాకర్థం కావటల్లేదు.”

“అతనికి భయపడి,”అంటూ నవ్వేడు సియావో.

“ఇక్కడి పనులు చూస్తుంటే, వాడంటే భయమేకాదు, వాడికిపూర్తిగా లొంగిపోతున్నాం అనిపిస్తుంది. ఇక మీరు ఇలాగే సాగిస్తే, నేను రేపే వెళ్ళిపోతాను.” అన్నాడు చిన్నవాంగ్ ఆవేశంగా.

“రేపా? ఇవాళయితే ఏం? లియూషెంగ్ ఇవాళే వెళ్ళిపోతున్నాడు— నువ్వూ అతనితో వెళ్ళిపోకూడదూ?”అని సరదాగా మొదలెట్టేడు సియావో. తర్వాత లేచి, గంభీరంగా చెప్పసాగేడు:

* మే నెల నాలుగోతేదీన ఇచ్చిన ఆదేశాలు.

"కావాలంటే హాన్‌ని కట్టిపడేసేవాడిని— లేకపోతే కాల్చేసేవాడిని. కానీ మనం ఓ సంగతి చూడాలి— జనం తిరగబడ్డారా అని, ప్రజలు వాళ్ళంతట వాళ్ళే ముందుకు రావాలి. మనం జనంతోపాటు ఎంతో ఓర్పుగా పనిచెయ్యకపోతే, భూస్వామ్యవిధానాన్ని కూలదొయ్యలేం. జనం తమ బతుకులని తమచేతుల్లోకి తీసుకొని, జమీందార్ల కోటల్ని నేలమట్టం చెయ్యగలగాలి. మనం ఒక్క హాన్‌ని చంపగలం, కానీ ఇంకా ఎంతో మంది భూస్వాములున్నారు."

"నువ్వు అతన్ని పోనిచ్చేవు. కానీ తప్పించుకోడని నమ్మకమేనా?" అన్నాడు చిన్నవాంగ్, సియావోని చూస్తూ.

"తప్పించుకుంటాడని నేననుకోను. వాడు ఇప్పుడు చాలా సంతోషిస్తున్నాడు. ఇక మనం వెళ్ళిపోతామని ఆశిస్తున్నాడు. వాడు యిప్పుడు పారిపోయినా, ఎప్పుడో ఒకప్పుడు మనకు దొరక్కపోడు. ప్రజలు చైతన్యవంతులయేక, వాడు ఏ దెయ్యమో అయి ఎగురుతున్నాసరే, ప్రజలు విసిరే వలలో చిక్కకపోడు."

సియావో మాటల్లో తొణికిసలాడిన విశ్వాసం చిన్నవాంగ్‌ని ఎంతో సంతృప్తిపరిచింది. వెంటనే సియావో మీదున్న కోపం మాయమయింది. తనుకూడా లేచి, తన నాయకుడితో పాటు నడిచేడు.

"ఇవాళ మీటింగులో, ఓ రంగురంగులచొక్కా వేసుకున్న కుర్రాణ్ణి చూసేవా?" అని అడిగేడు సియావో.

"అతనిపేరు 'కువో చువాన్ హై' అని చావో చెప్పేడు. ఇంతకుముందు హాన్ ఇంట్లో పనికుర్రాడు. ఇప్పుడు లీచెన్-చియాంగ్ దగ్గర కంబారిగా కుదురుకున్నాడు."

"అతను అసలైన రైతు అనిపించేడు. నువ్వు రేపోసారి వెళ్ళి అతనితో మాటాడితే?"

వాళ్లు స్కూలుకి తిరిగొచ్చేసరికి భోజనం తయారుగా వుంది. భోజనం తర్వాత దళంలోని పార్టీ సభ్యుల మీటింగు జరిగింది. అందులో లియూషెంగ్, చిన్నవాంగ్‌ల తప్పుడు భావాలను తీవ్రంగా విమర్శించేరు.

(ఇంకా ఉన్నది)

# నవల - ప్రజలు

రాల్ఫ్ ఫాక్స్
అనువాదం: కొత్తపల్లి రవిబాబు

## మార్క్సిజం — సాహిత్యం

మార్క్సిజం భౌతిక తత్త్వశాస్త్రం. పదార్థం (matter) ప్రాముఖ్యతను మార్క్సిజం గుర్తిస్తుంది. ప్రపంచం మన ప్రమేయం లేకుండా స్వతంత్రంగా మన గల్గుతుందని నమ్ముతుంది. పదార్థం గతిశీలమైనదనీ, దానికి చరిత్ర గమనంవుందనీ, ప్రపంచంలో ఏదీ ఎదుగూ బొదుగూ లేకుండా వుండదని మార్క్సిజం చెబుతుంది. వాళ్ళ దృక్పథం. మార్క్స్, ఎంగెల్సుల దృక్పథంలాంటిది కాకపోయినా 17 వ శతాబ్దపు రచయితలు భౌతిక జీవన దృక్పథంతో ఘర్షణ పెట్టుకునేవారుకారు. రెబిలియా (Rabelais), [1]మాంటేగ్ (Montaigue) [2] ల నుంచి తన తాత్త్విక దృక్పథం రూపొందించుకున్న షేక్స్పియర్[3]కు మార్క్స్ చెప్పిన జీవిత దృక్పథంలో భయానకమైన విషయాలేవీ కనబడి వుండేవికాదు. 18 వ శతాబ్దంలో బ్రిటిషు రచయితలలో మహామహులు భౌతిక జీవన దృక్పథాన్ని అసందిగ్ధంగా అంగీకరించి వుండేవారే.

కాని ఈనాటి పరిస్థితి వేరు. ఒక శతాబ్దం నుంచి ఈ పరిస్థితి ఇలాగేవుంది. ఈనాడు సాహిత్యవేత్తలు భౌతిక వాదానికీ, కాల్పనిక జగత్తుకూ పొత్తు కుదరదంటారు ఈ రెండింటి మధ్య పొత్తువల్ల సృజనాత్మక సృష్టి జరగదుగాని పాడుగోల మాత్రం పుడుతుందని వీరంటారు. కాని ఇది చాలతప్పుదారి పట్టించే దృక్పథం. ఎందుకంటే కాల్పనిక సాహిత్యకారుడు— ప్రత్యేకంగా నవలాకారుడు భౌతిక జీవన దృక్పథం అవలంబించడం ప్రపంచంలో అతి సహజమైన విషయంగా కనబడుతుంది.

పదార్థానికీ, ఆత్మకూగల అంతిమ సంబంధం గురించి మార్క్సిస్టు అవగాహన "భౌతిక జీవితమే చైతన్యాన్ని నిర్ణయిస్తుంద"ని[4]. రచయిత భావం వాస్తవంగా ఇదే ఐనా కాకపోయినా అతని సృజనాత్మక రచనకు నిజానికి యిది ఆధారంగా వుండాలి. ఎందుకంటే కల్పనాత్మక సృష్టంతా రచయిత నివసించే వాస్తవ ప్రపంచపు ప్రతిబింబమే కనుక. అతను సృష్టించేదంతా ప్రపంచంతో అతనికిగల సంబంధాల ఫలితం నుంచి జనించేదే. ప్రపంచంలో అతను చూచినవాటిపట్ల అతనికి కల్గే ద్వేషంగానీ, ఇష్టంగానీ తెలియచేసేవే అతని రచనలు.

వెలుగునీడలు, రూపారూపాలు, మలయమారుతాలు, జీవితసుగంధాలు, జంతువుల, మానవుల శారీరక సౌందర్యాలూ, వికారాలూ, స్త్రీ పురుషులయొక్క, రచయితయొక్క దైనందిన కార్యకలాపాలూ, ఆలోచనలూ, వారి కలలూ యివన్నీ సాహిత్యానికి వస్తువులు.

కవిత్వానికి మూడు లక్షణాలుండాలన్నాడు మిల్టన్.[5] కవిత్వం నిరాడంబరంగానూ (Simple), ఇంద్రియానుభూతి కల్గించేదిగానూ (Sensuous), ఉద్రేకపరచేదిగాను (Passionate) వుండాలన్నాడు. వాస్తవప్రపంచాన్ని పట్టించుకోని కళ, పంచేంద్రియాలను పట్టించుకోని కళ కళకాదు. అటువంటిదానిని కనీసం కళకు సంబంధించిన నీడగా కూడా గుర్తించం. సృష్టికర్తకూ బాహ్యావాస్తవికతకూ మధ్యగల సంఘర్షణను, అవాస్తవికతను క్షుణ్ణంగా అర్థంచేసుకొని దానిని పునర్సృష్టి చేయడము సృజనాత్మకపద్ధతి సారం. "కాని సాహిత్యమంతా ఆర్థికావసరాలు, ఆర్థిక పద్ధతుల ప్రతిబింబాలేనని మార్క్సిజం చెబుతుందే!" దీనికి అభ్యంతరం చెప్పాలి.

ఈ అభిప్రాయం మార్క్సిస్టు గతితార్కిక భౌతికవాదంతో ఏమాత్రం సంబంధం లేని, 19వ శతాబ్దంలో ప్రవర్తిల్లిన నిశ్చయవాదానికి సంబంధించిన(PositiveSchool) భౌతికవాదుల అభిప్రాయం కావచ్చుకాని, మార్క్సిస్టు అవగాహన ఏమాత్రం కాదు. సమాజపు ఆధ్యాత్మిక జీవితానికీ (దీనిలో కళాసృష్టి ఒకభాగం), జీవితపు భౌతికపునాదికి గల సంబంధాలగురించి మార్క్స్ తన "ఆర్థికశాస్త్రంపై పరిశీలన (Critique of Political Economy) అనే గ్రంథానికి రాసిన పీఠికలో ఇలా విశదీకరించాడు.

"జీవితావసరాలకు సంబంధించిన భౌతిక సాధనాల ఉత్పత్తి విధానమే, సామాజిక, రాజకీయ, మేధో జీవితాలను నిర్దేశిస్తుంది. ప్రజల చైతన్యం వారి భౌతిక జీవితాన్ని నిర్ణయించదు. వారి సాంఘిక అస్థిత్వమే వారి చైతన్యాన్ని నిర్ణయిస్తుంది. సమాజపు భౌతిక ఉత్పత్తి శక్తులు అభివృద్ధిచెందే ఒకదశలో అవి అప్పటికి అమలులో వున్న ఉత్పత్తి సంబంధాలతో ఘర్షిస్తాయి— మరోవిధంగా చెప్పాలంటే ఆస్తిసంబంధాలతో ఘర్షిస్తాయి. ఉత్పత్తిశక్తుల రూపాలు అభివృద్ధిచెందుతూ, ఆ సంబంధాలే వారికి సంకెళ్లగా మారుతాయి. అప్పుడు ఒక సాంఘిక విప్లవయుగం ప్రారంభమౌతుంది. ఆర్థిక పునాదులలో మార్పులవల్ల మొత్తం ఉపరినిర్మాణం (Superstructure) ఎంతో కొంత త్వరితంగా మారుతుంది. అటువంటి విప్లవాలను పరిశీలించేటప్పుడు ఉత్పత్తి విధానంలోని ఆర్థికపరిస్థితులలో వచ్చిన భౌతిక విప్లవానికీ, రాజకీయ, మత, రసతత్వ aesthetic), తాత్త్విక భావవాద, చట్టసంబంధమైన (Juridical) వాటిలో ఘర్షణలకు మధ్యగల భేదాన్ని మరువరాదు."[6]

కనుక మార్క్స్ భౌతిక జీవన విధానం అంతిమంగా మేధోజీవితాన్ని నిర్ణయిస్తుందని నమ్మాడు. కాని వీటి రెండింటిమధ్యకల సంబంధం ప్రత్యక్షమైనదనీ, తేలికగా అర్థమయ్యేదనీ, యాంత్రికంగా అభివృద్ధి చెందుతుందనీ మార్క్స్ ఎన్నడూ తలచలేదు. పెట్టుబడిదారీవిధానం ఫ్యూడలిజం స్థానాన్ని ఆక్రమించింది గనుక 'పెట్టుబడిదారీ' సాహిత్యంకూడా వెంటనే 'ఫ్యూడల్' సాహిత్యస్థానం ఆక్రమిస్తుందనీ, కనుక దీనిఫలితంగా కొత్తగా ఆవిర్భవించిన పెట్టుబడిదారీవర్గ అవసరాలను ప్రతిబింబిస్తూ కళాకారులు రచనలు చేయాలనే వాదనను మార్క్స్ గేలిచేసి వుండేవాడు. పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానం ఫ్యూడల్ ఉత్పత్తి విధానంకంటే అభ్యుదయకరమైనది గనుక, పెట్టుబడిదారీ సాహిత్యం ఫ్యూడల్ సాహిత్యానికంటె ఉత్తమమైనదనీ, అలాగే ఫ్యూడల్ సాహిత్యం. ప్రాచీన గ్రీకు, రోమన్, తూర్పురాజ్యాల సాహిత్యాలకంటే ఉత్తమమైనదనీ మార్క్స్ ఎన్నడూ భావించలేదు. అటువంటి అనాగరిక, అసభ్య, వికృతవాదనలకూ మార్క్సిజానికీ చాలదూరం.

సమాజపు భౌతిక పునాదులలోజరిగే మార్పులను ఆర్థిక చరిత్రకారుడు— ప్రకృతిశాస్త్రాలలో (natural sciences) లాగా ఖచ్చితంగా నిర్ణయించ వచ్చునని మార్క్స్ సరిగా చెప్పాడు. అంటే యీ మార్పులను శాస్త్రబద్ధంగా నిర్ణయించినట్లు అనుకోకూడదు. కాని సాంఘిక, ఆధ్యాత్మిక జీవితపు ఉపరి నిర్మాణంలోని మార్పులను అంత శాస్త్రీయంగా కొలవలేం. మార్పులు వస్తుంటాయి. ప్రజలు వాటిని గమనిస్తూ వుంటారు. మానసికంగా కొత్తపాతల మధ్య ఘర్షణపడుతుంటారు. పాతవారసత్వం ఒక్కోసారి కృంగదీస్తుంది. ఈ పోరాటం చాల అస్పష్టంగా జరుగుతుంది. కనుకనే ప్రజలలో వచ్చే మానసిక మార్పులను అర్థంచేసుకోవడం కష్టం.

ఉదాహరణకు— "నెపోలియన్ రూపొందించినస్మృతి" (Code Napolion) తీసుకుందాం.[7] ఇది ఫ్రెంచి విప్లవ ఫలితంగా వచ్చిన సాంఘిక ఆర్థిక మార్పులకు చట్టబద్ధమైన వ్యక్తీకరణ (expression). కాని ఇది తెలిసినంతమాత్రాన "నెపోలియన్ రూపొందించిన స్మృతి" (Code Napolion) అంతా అర్థమైనట్లుకాదు. ఇది అర్థంకావాలంటే, ఫ్రాన్సు గతచరిత్రనూ, ఫ్రాన్స్‌లో విప్లవానికి పూర్వంగల వర్గసంబంధాలనూ, విప్లవక్రమాన్నీ, వర్గ సంబంధాలలో విప్లవం తెచ్చిన మార్పులనూ, నెపోలియన్ సైనిక నియంతృత్వాన్నీ క్షుణ్ణంగా తెలుసుకోవాలి. అప్పుడుగాని నెపోలియన్ రూపొందించిన స్మృతి. అనేది నెపోలియన్ కాలంలో ఆవిర్భవించిన నూతన బూర్జువా సమాజంయొక్క, ఫ్రెంచి పారిశ్రామిక విప్లవంయొక్క చట్టబద్ధమైన వ్యక్తీ

కరణగా అర్థంచేసికోలేము. ఉత్పత్తి పద్ధతులు మారితే వాటితోబాటు చట్టం చాల తేలికగా మారుతుంటుంది. కాని సాహిత్యం అంతత్వరగా మారదు.

జె. బ్లాక్ (J. Bloch) కు 1890లో ఎంగెల్సు ఒకఉత్తరంరాస్తూ ఈ అంశాలపై తన నిశ్చితాభిప్రాయాన్ని యిలా వెలిబుచ్చాడు. "చారిత్రిక భౌతికవాదంప్రకారం చరిత్రలో నిర్ణాయకపాత్ర వహించేది అంతిమంగా వాస్తవ జీవితంలోని ఉత్పత్తి, పునరుత్పత్తి విధానంమాత్రమే. ఇంతకంటే ఎక్కువగా నేనుగాని, మార్క్సుగాని ఎన్నడూ చెప్పలేదు. దీనినే ఎవరైనా కేవలం ఆర్థికాంశంమాత్రమే నిర్ణాయక పాత్ర వహిస్తుందని మేము చెప్పామని వక్రీకరిస్తే అది అర్థంలేని అనుభవశూన్యమైన వ్యాఖ్యానమే అవుతుంది. ఆర్థిక పరిస్థితిని ఆధారంగా తీసుకోవాలి. ఉపరినిర్మాణంలోని అనేక అంశాలు, వర్గపోరాటపు రాజకీయరూపాలు, వాటి ఫలితాలు, యుద్ధానంతరం గెలుపొందిన వర్గాలు నెలకొల్పిన రాజ్యాంగాలు మొదలైనవి, చట్టాల వివిధరూపాలు, పోరాటంలో పాల్గొనినవారి మనస్సులలో ఏర్పడిన రాజకీయ సంబంధమైన, చట్టసంబంధమైన, తాత్త్వికసంబంధమైన, మతసంబంధమైన ముద్రలు– ఇవి కరడుగట్టిన సిద్ధాంతాలుగా తయారవడం– ఇవన్నీకూడా చారిత్రకపోరాటక్రమంలో తమ ప్రభావాన్నిచూపిస్తాయి. ఎన్నో సందర్భాలలో దాని రూపాన్ని నిర్ణయించిడంలో ప్రధానపాత్ర వహిస్తాయి. ఈ అంశాలన్నిటికీ పరస్పర సంబంధంవున్నా, ఆ సంబంధాలను రుజువుచేయడం అసాధ్యంగనుక అవి లేవనో లేక వాటిని నిర్లక్ష్యంచేయడమో జరుగుతుంది. వీటన్నిటిలోనూ ఆర్థిక ఉద్యమం అంతిమంగా అవసరమైనదిగా బయల్పడుతుంది. ఇలా కాకపోతే, చరిత్రలో ఏ యుగానికైనా ఒక సిద్ధాంతాన్ని అంటగట్టడం ప్రథమఘాత సమీకరణలకు (Simple equations of first degree) సమాధానాలను తెప్పించడంకన్నా తేలిక కాగలదు."

ఆర్థికకారణాలలో ఏ మార్పు విషయంలోనైనా అంతిమ నిర్ణాయక అంశంతన వద్దవుంచుకొని, 'భావాల' (ideal)కుచెందిన అంశాలుకూడ చరిత్రగమనాన్ని ప్రభావితం చేస్తాయన్నవాదనను– అంతేగాక ఈ మార్పులుపొందే రూపాన్ని(రూపాన్నిమాత్రమే) నిర్ణయించడంలోకూడా ఈ అంశాలు ప్రభావితం చేస్తాయన్నవాదనను మార్క్సిజం తిరస్కరించదు, మానవ చైతన్యంలోని ఆధ్యాత్మిక అంశమైన కళాసృష్టియొక్క ప్రాముఖ్యతను మార్క్సిజం నిర్లక్ష్యం చేస్తుందనడం మార్క్సిజానికి వికృతవ్యాఖ్యానాలివ్వడమే అవుతుంది. కేవలం భౌతిక, ఆర్థిక పరిస్థితుల ప్రత్యక్ష ప్రతిబింబమే సాహిత్యమని మార్క్స్ చెప్పాడనడంకూడ విపరీత వ్యాఖ్యానమే. మార్క్స్ అలా ఎన్నడూ అన

లేదు. మతంగానీ, తత్త్వశాస్త్రంగానీ, సంప్రదాయంగానీ సాహిత్యసృష్టిలో ప్రముఖ పాత్ర వహిస్తాయని— వీటిలో ఏ ఒకటిగానీ లేక భావాలకు చెందిన అంశాలుగాని సాహిత్యరూపాన్ని నిర్ణయించడంలో ప్రధానపాత్ర వహిస్తాయని ఆయనకు బాగాతెలుసు. సాహిత్యసృష్టికి అవసరమైన అంశాలన్నిటిలోనూ, అంతిమంగా అవసరమైనదానిగా ఎంచబడాల్సింది ఆర్థిక ఉద్యమం. చారిత్రకమార్పులలో ఏదైతే వాస్తవమని మార్క్స్-ఎంగెల్సులు ఎంచారో అదే సౌందర్యసృష్టి (aesthetics)లోనూ వాస్తవమని వారు నమ్మారు.

మార్క్సిజం వ్యక్తినీ, వ్యక్తి పాత్రనూ నిరసిస్తుందన్న వాదన మనం తరచు వింటూవుంటాం. వ్యక్తిని ఆర్థిక శక్తుల చేతిలో ఒక ఎరగామాత్రమే మార్క్సిజం భావిస్తుందని ఈ వాదనచేసేవారనుకుంటారు. ఈ ఆర్థిక శక్తులు ప్రాచీనగ్రీకులు నమ్మిన విధి (Fate) [8]లాగా వ్యక్తిని నాశనం చేయడానికి కృషిచేస్తాయని వీరు తలుస్తారు. బాహ్యశక్తులు (External Fate) మనిషిని తప్పనిసరిగా మృత్యువువైపు నెట్టుతాయన్న భావనవల్ల సాహిత్యసృష్టి అసాధ్యమన్న వాదనలో నిజానిజాలు ప్రస్తుతానికి ఆవలబెడదాం. కాల్విన్ (Calvin) [9] మతసిద్ధాంతాలు ఉత్తమసాహిత్యాన్ని సృష్టించలేదుగాని, ప్రళయం, విధి అనే భావాలు మాత్రం ఉదాహరణకు గ్రీకు విషాదాంత నాటకాలలోనూ, థామస్ హార్డీ నవల[10]లోనూ ఉత్తమ సాహిత్య సృష్టికి ప్రేరేపకాలుగా పనిచేసాయి. వ్యక్తిపాత్రను మార్క్సిజం అణకద్రొక్కుతుందన్న అభ్యంతరం— నిజంగా మార్క్సిజానికి సంబంధించినదైతే— అంగీకరించాల్సిందే. ఈ అభ్యంతరం పాశ్చాత్య ప్రపంచపు మానవత్వ సంప్రదాయంగల ఉత్తమ సాహిత్యంచే ప్రభావితమైనది గనుక ఇది తీవ్రమైన అపార్థంపై ఆధారపడివున్నా— దీనిని గౌరవించి సమాధానం ఇవ్వాలి.

ఎందుకు అపార్థంపై ఆధారపడి వుందంటున్నానంటే, నిజానికి మార్క్సిజం వ్యక్తిపాత్రను తిరస్కరించదు.[11] ప్రజారాశులను(masses) అజేయమైన ఆర్థికశక్తుల గుప్పిటిలో చిక్కుకున్నవారిగా మార్క్సిజం చూడదు. నిజమే. కొన్ని మార్క్సిస్టు సాహిత్య రచనలు, ప్రత్యేకంగా 'శ్రామికు'లకు సంబంధించిన నవలలు, అమాయకులైన విమర్శకులు ఈవిధంగా నమ్మడానికి దోహదం చేసాయి. కాని ఇది నవలారచయితలలో లోపంగాని మార్క్సిజంలో లోపంకాదు. మారుతున్న ప్రకృతితోబాటు చైతన్యవంతంగా మారుతూ, నూతన విధానాలను మానవుడు సృష్టించుకోవడమనే ఉన్నత కథావస్తువు తీసుకొని దాని ఎత్తుకు ఎదగలేకపోవడం నవలాకారుని బలహీనత. మార్క్సిస్టు తత్త్వశాస్త్రానికి కేంద్రం మానవుడు. భౌతిక శక్తులు మానవుణ్ణి కొంతవరకు మార్చవచ్చునంటూనే, మానవుడే భౌతిక జీవితాన్ని మారుస్తాడు, ఈ మార్పు జరిగేక్రమంలో మానవుడు తానుకూడా మారుతాడుఅని మార్క్సిజం గట్టిగానమ్ముతుంది.

మార్క్సిస్టు తత్త్వశాస్త్రానికి మానవుడు— మానవపురోభివృద్ధి మూల విషయం. మానవుడు ఎలా మారతాడు? బాహ్యప్రపంచంతో అతని సంబంధాలు యెలాంటివి? మార్క్సిస్టు సిద్ధాంతవేత్తలు ఈ ప్రశ్నలు పరిశీలించి సమాధానాలు ఇచ్చారు. మార్క్సిస్టు తత్త్వశాస్త్రాన్ని ఇప్పటికే పలువురు మేధావులు ప్రతిభావంతంగా విశదీకరించారు గనుక మరల దానిని ఇప్పుడు చెప్పబోను. కాని మానవుణ్ణి, చైతన్యవంతుడైన చారిత్రిక ప్రతినిధిగా, జీవితపోరాటంలో పాల్గొనే వీరునిగా పరిశీలిద్దాం. ఎందుకంటే ఈ మానవుడే ఒకవైపు సాహిత్యాన్ని సృష్టించేవాడు— మరోవైపు సాహిత్యానికి వస్తువు. ఎంగెల్సు చరిత్రలో వ్యక్తిపాత్రను ఈవిధంగా వివరించాడు.

"అసంఖ్యాక ప్రజల ఇచ్ఛల (wills) మధ్య ఘర్షణలతో అంతిమఫలితంవచ్చేట్లు చరిత్ర తన గమనాన్ని దిద్దుకుంటుంది. ప్రతి వ్యక్తికీగల యిచ్ఛ అతని జీవితప్రత్యేక పరిస్థితుల సముదాయంపై ఆధారపడి ఏర్పడుతుంది. ఈవిధంగా అసంఖ్యాకమైనశక్తులు అనంతమైన శక్తులు చారిత్రక సంఘటన (event)ను రూపొందిస్తాయి.[12] చైతన్యంతో ప్రమేయంలేకుండా, ఇష్టాఇష్టాల ప్రసక్తి ఆవలకునెట్టి పనిచేసే ఒకానొకశక్తి సాధించిన ఫలితంగా దీనిని మనం మొత్తంమీద పరిగణించవచ్చు. ఎందుకంటే ఒక వ్యక్తి కోరేదానికి ఇతరులందరూ అడ్డుపడతారు. ఆఖరకు యీ ఘర్షణ నుంచి ఏ ఒక్కరూ కోరనటువంటి ఫలితం వస్తుంది. ఈ విధంగా గత చరిత్ర ప్రకృతిబద్ధంగా, ఒకేరకమైన గతిసూత్రబద్ధంగా ముందుకు సాగుతుంది. వ్యక్తులు తమ ఇష్టాలను శారీరక పరిస్థితులు, బాహ్యపరిస్థితులు, వ్యక్తిగత సామాజిక పరిస్థితులపై ఆధారపడి ఏర్పరచుకుంటారు. ఈ వ్యక్తిగతమైన యిచ్ఛలు చివరకు తీరకపోగా, ఇవన్నీ కలసి ఒక సంఘటితమైన ఫలితం— ఒక సరికొత్త ఫలితం— ఏ ఒక్కరూ వ్యక్తిగతంగా కోరనటువంటి ఫలితం వచ్చినపుడు దానివిలువ సున్నాతో సమానమైనదిగా పరిగణించరాదు. ప్రతి ఒక్కరూ ఈ ఫలితం సాధించడానికి కృషిచేసారని, ఆమేరకు దానిలో తాము భాగస్వాములమయ్యామనీ భావించాలి."

ఈ సిద్ధాంతం (formula) చరిత్రకారునికీ, నవలాకారునికీ కూడా వుపయోగపడుతుంది. జీవితపోరాటంలో వ్యక్తిగత కోర్కెలు ఇతరుల కోర్కెలతో పోరాడటం అనే సత్యాన్ని గమనించడం నవలారచయితకు అత్యవసరం. మనిషికి కోర్కెలు ఎప్పటికీ తీరకపోవడం అనేది అతని శాపం. కాని అదే అతని కీర్తిని తెచ్చిపెడుతుంది, ఎలాగంటే ఆ కోర్కెల సాధనకై మానవుడు నిరంతరం కృషిచేస్తూ తాను మారుతూ, ఎంతోకొంత తనచుట్టూవున్న జీవితాన్ని మారుస్తాడు. మానవుడి విధినిర్ణయించడంలో X=O అనే సూత్రాన్ని మార్క్సిజం అంగీకరించదు. దానికి వ్యతిరేకంగా "ప్రతి

ఒక్కరూ ఈ ఫలితం సాధించడానికి కృషిచేసారని, ఆమేరకు దానిలో తాము భాగస్వాములమయ్యామనీ భావించాలి."

వ్యక్తుల ఇష్టాలు, కోరికలు, ఉద్వేగాలు మధ్య జరిగే ఘర్షణ— రూపరహిత, చైతన్యరహిత మానవులమధ్య జరిగే ఘర్షణగా (a conflict of abstract human beings) ఎంచకూడదు. ఎంగెల్సు ఈ విషయంలో జాగ్రత్తపడి, వ్యక్తుల కోర్కెలు, చర్యలు, వారి శారీరక ప్రవృత్తులపైన, అంతిమంగా వ్యక్తిగత, సామాజిక, ఆర్థిక పరిస్థితులపైన ఆధారపడి వుంటాయని చెప్పాడు. వారి సామాజిక చరిత్రలోకూడ, అంతిమంగా, వారికి సంబంధించినవర్గం, వైరుధ్యాలతోనూ, ఘర్షణలతోను నిండివుండే వారి వర్గమనస్తత్వం నిర్ణాయకపాత్ర వహిస్తుంది. కనుక ప్రతివ్యక్తి ద్వంద్వప్రకృతి కల్గి వుంటాడు. ఒకవైపు అతను సామాజిక చరిత్రకలిగివున్న ఒక నమూనాపాత్ర (type)— మరోవైపు వ్యక్తిగతచరిత్ర కల్గినవాడు. ఈ రెండూ పరస్పరం వ్యతిరేకమైనవిగా కనబడినా వ్యక్తిగతచరిత్రను, సామాజిక చరిత్ర అదుపులోపెడ్తుందిగనుక, రెంటిమధ్య ఐక్యత వున్నట్లే. దీని అర్థం, సాంఘిక చరిత్ర వ్యక్తికిగల వ్యక్తిత్వంపై ఆధిపత్యం వహించాలనికాదు. ఫాల్‌స్టాఫ్[13], డాన్ క్విగ్జోట్[14], టామ్‌జోన్స్[15] జూలియన్ సొరెల్, మాన్రియర్ డి చార్లస్ ఇవన్నీ నమూనాలనదగ్గ (types) పాత్రలు. కాని ఈ పాత్రలలో గల సాంఘిక లక్షణాలు ఎప్పటికప్పుడు వారిని వ్యక్తులుగా మన ముందు నిలబెడ్తాయి. వారి వ్యక్తిగత ఆశానిరాశలు, వారి ప్రేమలు, ద్వేషాలు, వారి వాంఛలు ఒకదాని తర్వాత మరొకటి సాంఘిక పరిస్థితులను బయల్పెడతాయి.

వీటన్నిటిని అర్థంచేసుకునే సమ్యగ్‌దృష్టి లేకపోతే నవలాకారుడు మానవుని చరిత్రను ప్రతిభావంతంగా రాయలేడు. తన పాత్రల వ్యక్తిగత ఘర్షణలద్వారా అంతిమఫలితం ఎలావస్తుందో అతను అర్థంచేసుకోవాలి. స్త్రీపాత్రగానీ, పురుషపాత్రగానీ, ఆ పాత్రను ఆవిధంగా తీర్చిదిద్దిన అసంఖ్యాకపరిస్థితులను రచయిత అర్థంచేసుకోవాలి. "ఆఖరకు ఏ ఒక్కరూ కోరనటువంటి ఫలితం వస్తుంది." ఈవాక్యం ప్రతి ఉత్తమరచనకు వర్తిస్తుంది. ఎవరూ కోరనటువంటి యీ ఫలితం వెనుక ఒక పద్ధతి (Pattern) వుంది. ఆ జీవితపద్ధతిని యీ వాక్యం రసవత్తరంగా వర్ణిస్తోంది. ఈ జీవితపద్ధతిలో ప్రతి వ్యక్తికీగల పాత్రగురించీ, ఈ పద్ధతి అవగాహన చేసుకోవడం ద్వారా వాస్తవికతపట్ల సృజనాత్మక రచయిత కళ్లు తెరిపించడమనేది మార్క్సిజం చేస్తుంది. అదే సమయంలో వ్యక్తికి గల పూర్తి విలువను గుర్తిస్తుంది. కనుక ప్రపంచంలో వున్న దృక్పథాలన్నిటిలోనూ మహోన్నత మానవతా దృక్పథంకల్గినట్టిది మార్క్సిజం.

## వ్యాఖ్యలు – వివరణలు.

1. Francois Rabelais (1495–1553)– ఫ్రెంచి రచయిత. మానవతావాది. వ్యంగ్య రచనలో చేయిదిరిగిన రచయిత. తన తండ్రికీ పొరుగింటివాడికీ చేపలు పట్టుకునే హక్కుపైవచ్చిన తగాదాను కథావస్తువుగా తీసుకొని ఒక వ్యంగ్య రచనచేసాడు. దానిలో సాధారణ గ్రామీణజీవితాన్ని ప్రతిభావంతంగావర్ణించాడు.

2. Michel Eyquem de Montaigue (1533–92) ఫ్రెంచి వ్యాసరచయిత- ఆత్మాశ్రియ వ్యాసరచనకు పితామహుడు. మార్పు మానవలక్షణమని నమ్మిన వాడు. ఈ ప్రపంచంగురించి మానవుడు ఇక తెలుసుకోవాల్సిందేమీలేదు అనే పిడివాదాన్ని వ్యతిరేకించి, ఆధునికంగా ఆలోచించడం ప్రథమంగా నేర్పినవాడు.

3. షేక్స్పియర్- 1564–1616. ప్రసిద్ధ ఆంగ్ల నాటకకారుడు, మానవతావాది. మానవుడి గురించి 'హామ్లెట్'అనే నాటకంలో యిలా అంటాడు. "What a Piece of work is a man! How noble in reason! how infinite in faculties! in form and moving, how express and admirable! in action. how like an angel! in apprehension, how like a god! the beauty of the world! the Paragon of animals!" (Act II. Scene 2)

4. దీనికి ఇంగ్లీషు మూలం "Being determines consciousness."

5. John Milton (1608–74)– ప్రసిద్ధ ఆంగ్లరచయిత. మానవతావాది. ఐతే మతంపై పిచ్చినమ్మకం కలవాడు. ఆలివర్ క్రాంవెల్‌తోపాటు మొదటిచార్లెస్ రాజరికానికి వ్యతిరేకంగా పార్లమెంటు పక్షాన నిలచి ప్రత్యక్షంగా పోరాటంలో పాల్గొన్నాడు. మతంలోగానీ, రాజకీయాలలోగానీ మానవునికిగల స్వేచ్ఛ, స్వాతంత్ర్యము, స్వయంనిర్ణయహక్కు (free will) లను బలపర్చాడు.

6. పాఠకుల సౌకర్యార్థం ఈ వాక్యం ఇంగ్లీషుమూలం ఇస్తున్నాను.
"In considering such revolutions the distinction should always be between the material revolution in the economic conditions of production which can be determined with the precision of natural science, and the juridical, religious, aesthetic or Philosophic– in short, ideological forms— in which men become conscious of this conflict and fight it out."

7. ఫ్రెంచి విప్లవానంతరం పాత విలువలు, పాత చట్టాలు, పాత అలవాట్లు, ఆచారాలుస్థానే కొత్త విలువలు, కొత్త చట్టాలు, కొత్త ఆచారాలు వచ్చాయి. వాటిని క్రోడీకరించి ఒక చట్టంలాగా ఏర్పాటు చేసింది నెపోలియన్. కనుక

దీనికి Code Nepoleon అనే పేరు వచ్చింది. Penal code అంటే శిక్షా స్మృతి అంటున్నాం గనుక దీనిని నెపోలియన్ రూపొందించిన స్మృతి అని అనువదించాను.

8. ప్రాచీన గ్రీకులు, విధిని తిరుగులేని దైవికశక్తిగా భావించారు. మనిషి వారి దృష్టిలో విధిచేతిలో ఆటబొమ్మమాత్రమే. మనిషి నిస్సహాయుడు. ఈ విధి బహుక్రూరమైనది. మనిషిని పలువిధాల బాధిస్తుంది. ఈ భావం గ్రీకులలో గాఢంగావుండటంచేత ప్రాచీనగ్రీకు నాటకాలన్నీ విషాదాంతాలే. అంటే వారి ఉద్దేశం ప్రకారం అంతిమంగా మనిషికి మిగిలేది విషాదమే. విధి మనిషిని ఎప్పుడు వెక్కిరిస్తూ వుంటుంది.

9. John Calvin (1509–64)– మార్టిన్ లూథర్ తర్వాత ప్రొటెస్టంట్ మతంలో రెండవస్థానం ఆక్రమించినవాడు. లూథర్ సిద్ధాంతాలతో ప్రభావితుడైనాకూడా, మనిషికి దేవునిపై గల విశ్వాసం అనే భావానికిగాక, దేవుడు మనిషిపై చూపే వాత్సల్యం అనే భావానికి ప్రాముఖ్యమిచ్చాడు. పాపులైన మానవులు మంచి పనులు చేయడంద్వారా, దేవునిపై విశ్వాసం వుంచడంద్వారా మాత్రమేకాక దేవుడు వారిపై చూపే వాత్సల్యంచేతనే రక్షింపబడతారన్నది కాల్విన్ ప్రబోధించిన ముఖ్య సిద్ధాంతం,

10. Thomas Hardy 1840–1928. ఇంగ్లీషు నవలాకారుడు. ఇతనిరచనలలో విధి వివిధరూపాలలో పాత్రలను దురదృష్టవంతులుగా మార్చేస్తుంది. ఉదాహరణకు— ఒక సంపన్న వ్యవసాయదారుడు నాయకుడనుకోండి ఒకనవలలో. విధి తుపానురూపంలో అతని పంటలన్నిటినీ వరుసగా కొన్నేళ్లపాటు నాశనంచేస్తుంది అతను బీదవాడై నానా కష్టాలుపడతాడు. మరో ఉదాహరణ: నాయికకు తన ప్రియుడురాసిన ఒక ముఖ్యమైన ఉత్తరం కనబడదు. అది తివాచీకింద పొరపాటున పడిపోతుంది. ఆ చిన్న దురదృష్టకర సంఘటన ఆధారంగా నాయిక జీవితం ప్రధానమైన మలుపులు తిరుగుతుంది.

11. ఈ సందర్భంలో 'మార్క్సిస్టు తత్త్వశాస్త్రం'— వి. అఫినాసియేవ్– విశాలాంధ్ర ప్రచురణ– పుట 338లో గల ఈ పేరా చూడండి.

"మార్క్సిస్టు సిద్ధాంతం వ్యక్తిపాత్రను తక్కువఅంచనా వేయటంలేదు. వ్యక్తులు తమ ఇష్టప్రకారం చరిత్ర భౌతికగతిని మార్చలేరని మార్క్సిస్టులు అంటున్న

ప్పటికీ, సామాజిక పరిణామంలో వ్యక్తి నిర్వహించేపాత్ర తక్కువైనదేమీ కాదని వారు అంగీకరిస్తున్నారు. 'చారిత్రావశ్యకత అనే భావం, చరిత్రలో వ్యక్తికి పాత్ర ఉన్నదనే భావానికి వ్యాఘాతంకాదు. చరిత్రయావత్తూ వ్యక్తుల కార్యాచరణే. ఈ వ్యక్తులు క్రియాశీలురనే విషయం నిస్సందేహం' అన్నాడు లెనిన్. సామాజిక పరిణామంలో వ్యక్తులకున్న వాస్తవమైన ప్రాముఖ్యాన్ని మార్క్సిస్టు సిద్ధాంతం నిరూపించింది.

12. ఈ వాక్యం ఇంగ్లీషుమూలం ఇది. "Thus there are innumerable intersecting forces, an infinite series of Parallelograms of forces which give rise to one resultant– the historical event."

13. హెన్రీ, ఫోర్తు– మొదటిభాగం. అనే షేక్స్పియర్ నాటకంలో ప్రముఖంగా కనబడే హాస్యపాత్ర.

14. 1547–1616 ల మధ్య జీవించిన (Cervantes) సెర్వాంటెజ్ అనే స్పానిష్ రచయిత సృష్టించిన హాస్యపాత్ర.

15. 1707–54 ల మధ్య జీవించిన ఇంగ్లీషు నవలా పితామహుడు హెన్రీ ఫీల్డింగ్ రాసిన అదేపేరుగల నవలలో నాయకుడు. ఫీల్డింగ్ తన సమకాలీన సమాజం లోని ధనికవర్గాలలో పేరుకుపోయిన కుళ్లును బట్టబయలుచేస్తూ, వ్యంగ్యంగా విమర్శిస్తూ నవలలురాశాడు. రాల్ఫ్‌ఫాక్స్– ఫీల్డింగ్‌ను ప్రశంసిస్తూ "హెన్రీ ఫీల్డింగ్– వచనయుగపు ప్రతిభాశాలి" (Henry Fielding, Prose–Age Genius) అనే వ్యాసం రాశాడు.

# పెట్టుబడిదారీ దేశాలమధ్య యుద్ధాల అనివార్యత

స్టాలిన్

[ కామ్రేడ్ స్టాలిన్ యీ కింది విషయాల్ని 1952 ఫిబ్రవరిలో రాశారు. అప్పటి సోవియట్ యూనియన్ ప్రభుత్వం రాజకీయ అర్థశాస్త్రాన్ని రాయడంకొరకు కొంత మంది శాస్త్రవేత్తలను నియమించింది. వారు ఒక చిత్తుప్రతిని తయారుచేశారు. అది సోవియట్ అకాడమీలో చర్చించబడింది. ఆ చిత్తుప్రతినీ, దానిపై జరిగిన చర్చల సందర్భంలో వెల్లడయిన భిన్నాభిప్రాయాలను దృష్టిలోవుంచుకొని కామ్రేడ్ స్టాలిన్ రాజకీయ అర్థశాస్త్రానికి పరిపుష్టిచేకూర్చే లక్ష్యంతో సమగ్ర విమర్శ రాశారు. అందులో సామ్రాజ్యవాదులమధ్య వైరుధ్యం తప్పక యుద్ధాలకు దారితీస్తుందనే లెనిన్ సూక్తి సామ్రాజ్యవాదులమధ్యగల వైరుధ్యంకంటే సామ్రాజ్యవాదానికీ సామ్యవాదానికీ మధ్య గల వైరుధ్యమే బలమైనదిగా తయారైన యీనాడు వర్తిస్తుందా ? యుద్ధాన్ని నివారించాలనే ప్రపంచశాంతిఉద్యమం ఎంతో బలంగావున్న యీనాడు సామ్రాజ్యవాదం బతికివున్నంతవరకు యుద్ధం అనివార్యమనే లెనిన్‌సూక్తికి కాలం చెల్లలేదా ? వగైరా విషయాలపై రాయబడ్డభాగం ఒక అంశం. ఆ భాగాన్ని మాత్రమే యిచ్చట అనువదించి ప్రకటిస్తున్నాం.

మూడవ ప్రపంచయుద్ధాన్నిగూర్చి యీనాటికీ పలురకాల అభిప్రాయాలున్నాయి. పశ్చిమాసియాలోనో, ఆగ్నేయాసియాలోనో, మరోప్రాంతంలోనో ఉద్రిక్తత హెచ్చినప్పుడల్లా, నేడోరేపో ప్రపంచయుద్ధం ఆరంభంకాబోతున్నట్టూ, అలాంటిఉద్రిక్తతలు కాస్త సడలిపోగానే ఇంకట్లో యుద్ధప్రమాదమేలేనట్టూ భావించేవారు యీనాటికీ చాలా మంది వున్నారు. అలానే యుద్ధాన్నిగురించి కామ్రేడ్ స్టాలిన్ రాసినరోజునవున్న అభిప్రాయాలన్నీ యీనాటికీ విభిన్నరూపాల్లో వ్యక్తమవుతూనే వున్నాయి. ప్రత్యేకించి అమెరికా అధ్యక్షుడు చైనాయాత్ర కొనసాగించినప్పటినుండీ యిక ఇంతట్లో మూడవ ప్రపంచయుద్ధప్రమాదం లేనేలేదనే ధోరణి ప్రబలమయ్యింది. సామ్రాజ్యవాద పత్రికలన్నీ పనిగట్టుకొని అలాంటి అభిప్రాయాన్ని కవ్వించే వాతావరణం సృష్టించడంలో రాజకీయాలు పోలేదు. అంతేకాదు ఒకవేళ యుద్ధమేరావడమంటూ జరిగినా సామ్రాజ్యవాదులమధ్య జరగడం అసంభవమనీ, ఒకవేళ జరిగితే ప్రపంచసామ్రాజ్యవాదుల కూటమికీ చైనాకు మధ్యనే జరుగుతుందనే అభిప్రాయంకూడ తగినంత బలంగానేవుంది. ప్రపంచములో వివిధసామ్రాజ్యవాద దేశాలమధ్యా ముఖ్యంగా సోవియట్, అమెరికా

సామ్రాజ్యవాద దేశాలమధ్యా, మరోవైపు చైనా తదితర సామ్రాజ్యవాద దేశాలమధ్యా జరుగుతున్న సంప్రదింపులూ, వ్యాపార ఒడంబడికలే అలాంటి అభిప్రాయాలకు ప్రాతిపదిక. యుద్ధాలనుగురించిన మార్క్సిస్టు అవగాహన లోపించడంవల్లనూ, పైకి అంతా సజావుగానే కనిపిస్తున్న వాతావరణాన్నిమాత్రమే చూస్తూ దానివెనుకనున్న వైరుధ్యాల లోతును పరిశీలించే గతితార్కికదృష్టి లోపించడంవల్లనూ అలాంటి అవాస్తవికమయిన అంచనాలు రూపొందుతున్నాయి. వివిధ సామ్రాజ్యవాద దేశాలమధ్యగల వైరుధ్యాలను గురించి 1952లో కామ్రేడ్ స్టాలిన్ వూహించిన అభిప్రాయాలు చాల వాస్తవమని యీనాడు కళ్ళకుకట్టినట్టు రుజువవుతుంది. జర్మనీ, జపాన్‌లు అమెరికా ఇనుపపాదాలనుండి బయటపడి మార్కెట్లకొరకు దానితో ఎంతో బలంగా పోటీ పడుతున్నాయి. అలానే ఫ్రాన్సు వగైరాసామ్రాజ్యవాద దేశాలుకూడ మార్కెట్ల పంపకంకొరకు అమెరికాతో పోటీపడుతున్నాయి వెనుకబడ్డ దేశాలనుంచి ముడిసరుకుల్ని చవకగా కొనేయడానికీ గ్యారంటీ అయిన మార్కెట్లను సంపాదించుకోడానికీ అరబ్బుదేశాలలోని నూనెవనరులను తమ స్వప్రయోజనాలకు ఉపయోగించుకోడానికీ సామ్రాజ్యవాద దేశాలన్నీ ఒకదానితో ఒకటి తీవ్రాతితీవ్రంగా పోటీపడుతున్నాయి. ప్రపంచమంతటా పలుకుబడి విస్తరణ ప్రాంతాలు యేర్పరచుకోడానికి ఎన్నడూలేనంత తీవ్రంగా ప్రయత్నిస్తున్నాయి. ఒకవైపున శాంతినిగురించి ఒకరినిమించి మరొకరు పెద్దపెద్ద ఉపదేశాలుచేస్తూనే, మరోవైపు తమదేశాలలో ఆయుధ సైనికశక్తిని పెంచుకోదానికి ఒకరితో మరొకరు పెద్దఎత్తున పోటీపడుతున్నారు. సామ్రాజ్యవాదుల మధ్యగల అంతర్గతవైరుధ్యము, సోషలిస్టు ప్రపంచానికీ, సామ్రాజ్యవాదానికీ మధ్యగల వైరుధ్యము నానాటికీ తీవ్రతరమవుతున్న పర్యవసానం ఎలావుంటుందీ, ఆ పరిస్థితుల్లో అనుదినం పురోగమిస్తున్న ప్రపంచ విప్లవ శక్తులు అవలంబించాల్సివుంటుంది అనే విషయాన్ని నిర్ణయించుకోడానికీగాను, శాస్త్రీయమయిన ఆలోచనా విధానాన్ని కల్గించడానికి తోడ్పడుతుందనే వుద్దేశ్యంతో కామ్రేడ్ స్టాలిన్ వ్రాసిన "సోవియట్ యూనియన్‌లో సోషలిజానికి సంబంధించినఆర్థిక సమస్యలు" అన్న పుస్తకంలోనుండి పై విషయానికి సంబంధించిన యీ భాగాన్ని అనువదించి ప్రకటిస్తున్నాం. —సంపాదకుడు ]

రెండవ ప్రపంచయుద్ధం తరువాత నూతన అంతర్జాతీయ పరిస్థితులు తలెత్తడం వలన పెట్టుబడిదారీ దేశాలమధ్య యుద్ధాలు యింకెంతమాత్రమూ అనివార్యంకాదని కొందరు కామ్రేడ్సు భావిస్తున్నారు. పెట్టుబడిదారీ దేశాలమధ్యనున్న వైరుధ్యాలకంటె సోషలిస్టు శిబిరానికీ పెట్టుబడిదారీ ప్రపంచానికీ మధ్యనున్న వైరుధ్యాలే తీవ్రతరమైనవి. తక్కిన పెట్టుబడిదారీ దేశాలను తగినంత మేరకు అమెరికా తన ప్రాబల్యంలోనికి తెచ్చు

వి. బి గద్దర్ పాటలు :

## దొరోడో పాట

రెక్క బొక్క నొయ్యకుండ
సుక్క చెమ్ట వొడ్వకుండ
బొర్రి బాగ బెంచావ్‌రో–దొరోడో
నీ పెయ్యంత మంత్రిస్తం దొరోడో ॥రెక్క॥

వడ్డిమీద వడ్డిలాగి
మా రెక్కల సొత్తంత
గడ్డాముల పేర్చావ్‌రో–దొరోడో
నీ నడ్డి విరగదంతంరో దొరోడో ॥రెక్క॥

కాళ్ళు ఏల్లు మెక్కంగ
పెండ్లికేమి అప్పిస్తివి
అడ్డికి పావుసేరు
పుస్తె మట్టెలను గొంటివి
సస్తె మానాయెగాని–దొరోడో
సీమస్తి వాదల గొడ్తంరో దొరోడో ॥రెక్క॥

పోనీ పోనీ అంటే
కానీ కానీ అంటే
మా పానానికె ముప్పయితివి–దొరోడో
నీ పని బద్దైనె మాకు సుఖం దొరోడో ॥రెక్క॥

స్వాతంత్రం వొచ్చిందని
సర్కారు మనదేనని
యేటేటా నీకేమో
వోట్లేసి పెంస్తిమిరో–దొరోడో
నిన్ను మాటుగాసి సంప్తంరో దొరోడో ॥రెక్క॥

కాంగ్రెసు పుణ్యాన
కష్టమేమి రాలేదు
అమీన్‌సాబు దయవల్ల
ఆపదేమి రాలేదు
నీ కాల్లడుపులు మొక్కినోల్లమె - దొరోడో
నీ కీళ్ళు కీళ్ళు ఇరిచేస్తం దొరోడో. ॥రెక్క॥

## పిల్లో పోదాము పదవే !

పిల్లో నేనెల్లిపోతా - కన్నీరు పెట్టబోకు
బావో నే చిన్నదాన్ని - దారిలో ఒక్కదాన్ని
పిల్లో నేనెల్లిపోత - కలతలు సెందబోకు ॥పిల్లో॥

సత్యంతోవలబోతె సావుదప్పది నీకు
నిర్మల తోవలబోతె నీడ దొరకదినీకు
భాస్కరుని బాటపడ్తె బాధలు తప్పయినీకు
నరసింహరావు నడక నేర్తె నడిదోవల నరికేస్తరు

నువూరిడిసి పోకురో - బావోబావా
నిన్ను వురిదీస్తారురో - బావోబావా ॥బావో॥

నూరేండ్లు ఉన్నగాని సావుదప్పది మనకు
పిరికోళ్ళు రోజు రోజు సచ్చి పుడుతుంటారు
ప్రాణానికి భయపడక పోరాటం మానుకోక
సత్యంలాంటి వీరులు ఒక్కసారె చస్తారు
అ సచ్చేది ఏదో - పిల్లోపిల్లో
సత్యంతోవలసావు - పిల్లో పిల్లో ॥పిల్లో॥

కైలాసం కథ చెబితె నిన్ను ఖతం చేస్తారు
గణపతిని గుర్తుచేస్తె గురిచూసి కొడ్తారు
వర్గీసు పేరెత్తితె ఒంటరిగా వధిస్తారు
పాణిగ్రాహి పాట పాడ్తె నీ పాణం తీస్తారు
ఆ పాట మానేయరో - బావో బావా
నామాట వినావురో - బావో బావా ॥బావో॥

పాణాలు తీస్తరని పాట మానేస్తానా
పొడిచి చంపేస్తరని పిరికి వాణ్ణవుతానా
పాణిగాహి పాటలంటె - పిల్లో పిల్లో
నా పాణంలో పాణమే - పిల్లో పిల్లో
నా పాణంలో పాణమే - పిల్లో పిల్లో
నేనాపాట వొదలనే - పిల్లో పిల్లో

పిల్లో పోదాము పదవే
మన దళముతో కలిసిపోదాం
పిల్లో పోదాము పదవే

అవ్వతోడు అయ్యతోడు
నిన్నిడిసి బతుకేందీ
నా గొడ్డలి నువుదీస్కో-
నీ బరిసె నాకివ్వు
నీ యెంటే నేనొస్తా
నీ బాటే నేనడుస్త

బావో పోదాము పదర
మన దళముతో కలిసిపోదాం
బావో పోదాము పదరా

దోపిడి వర్గాల తలను
కసి కసిగా నరుకుదాము

శత్రువుల తలలన్నీ
తోరణాలు కడదాము
ఎర్రసేనలో కలసి
వెలుగు బాటలేద్దాము

పిల్లో పోదాము పదవే
మన దళముతో కలిసి పోదాం
పిల్లో పోదాము పదవే

## కదలవోయి కూలన్న
(కిసాన్ డ్యాన్సు)

కదలవోయి కూలన్న
నడవవోయి రైతన్న
ప్రజా సేనలో నేడే చేరగా
మనకు ప్రజా రాజ్య మొస్తేనే పండగ ॥కదలవోయి॥

కూడులేని నీయన్న
కొలువులేని నీతమ్ముడు
కలిసి మెలిసి సేనగ నడవాలిరా
కార్మిక రాజ్యమ్ము తేవాలిరా ॥కదలవోయి॥

కార్మికుడు ముందు నడువ
రైతుకూలి లిరుపక్కల
కదిలింది ఎర్రసేన బారులా
కుషీకుషిగా సేనలా చేరాలిరా ॥కదలవోయి॥

బంజేరు భూములు రైతన్న
దున్నిసాగు చేస్తివిరో కూలన్న

వానకట్టలెన్నిటినో రైతన్న
చెమటోడ్చి కడితివిరో కూలన్న
బంజరు భూములు దున్నిన వానకట్టలను కట్టిన
పొట్టనిండ గంజి దొరకదాయెరా
అందుకె ప్రజా సేనలో నేడే చేర ॥కదలవోయి॥

వూరిలోని భూస్వామిని రైతన్న
మాటుగాసి ఖతంచేయి కూలన్న
ఒక్కన్ని ఖతంచేస్తె తక్కిన దోపిడి దొంగలు
వూరు విడిచి పురికి పోతరన్నా
ఆ ఊరికి ఆనాడె పండుగన్న ॥కదలవోయి॥

దొరలా కాపాడేందుకు – అన్న రైతన్న
పోలీసులు వొస్తారు – అన్న కూలన్న
పోలీసుల చూసి నీవు – అన్న రైతన్న
పారిపోబోకురో – అన్న కూలన్న
పట్టిన పట్టు విడువక పోలీసులపైనబడి
తుపాకుల గుంజుకోవరన్నా
కొడుకుల తరిమి తరిమి కొట్టాలెరన్నా ॥కదలవోయి॥

మనదేశంలోన – కూలన్న
ఐదులక్షల గ్రామాలున్నాయన్న
వూరూర పదిమంది జనసేనలో చేరిన
యాభై లక్షలసేన మనదిరా మనముందు సర్కార్ సేనెంతరా
ఏనాటికైన విజయమ్ము మనదెరా అందుకె బందూకు చేతబట్టి
నడవరా! ॥కద॥

## కూలన్న! రైతన్న!
(కవాలి)

నిజం తెలుసుకోవరో — కూలన్న రైతన్న
నీతితొనడువాలిరో — కూలన్న రైతన్న
నిజం తెలుసుకోవాలి — నీతితో నడవాలి
నిజం తెలుసుకోవాలి — నీతితో నడవాలి
ఎర్రిజండకిందరో — కూలన్న రైతన్న
కన్నెర్రిసేయరో — కూలన్న రైతన్న ॥నిజం॥

మావో చెప్పినమాట — బతుకుదెరువుకూబాట
మావో చెప్పినమాట — బతుకుదెరువుకూబాట
ఆ తోవన నడిస్తే కన్పిస్తుంది నీకు ఎర్రిసేన-
ముసి ముసి నవ్వులతో సేనలో కలువన్న
ఖుషీఖుషీగా నీవు ముందుకే నడువన్న ॥నిజం॥

వ॥ ఎంప్లాయిమెంటు ఆఫీసులో పేరు రిజిష్టరుచేసి 6 సం॥ లయింది ఇంతవరకు కాల్ లెటరే కరువై పోయింది. రాకరాకనో లేక లేకనో స్వీపర్ కొలువుకో చెప్రాసి కొలువుకో ఒచ్చింది. దానికన్న బోదామంటె ఏజ్ బారై పోయింది-
దానికన్న బోదామంటె - ఏజ్ బారై పోయింది
దానికన్న బోదామంటె - ఏజ్ బారై పోయింది.

వ॥ మొన్ననే పేరు రిజిష్టరు చేసిన సర్పంచు కొడుకుకు, నిన్ననే కాల్‌లెటర్ వొచ్చి కొలువుమీద ఎక్కిండు—
దీనిలోని న్యాయమెందొ - తెలుసుకోర కూలన్న
దీనిలోని న్యాయమెందొ - తెలుసుకోర కూలన్న
దీనిలోని న్యాయమెందొ - తెలుసుకోర కూలన్న ॥నిజం॥

వ॥ కూలో నాలో జేసేటోళ్ళో గరీబోళ్ళో - చెట్లకింద, బొందల గడ్డకు పత్తాలాడ్తె - పోలీసోళ్ళు పట్టుకపోయి ఈపంతా పౌతంజేసి జేబులున్న పైసల్ గుంజుకొని - రెండు దప్పాలేసి సాగనంప్తరు - ప్రిన్స్‌క్లబ్బు రాయల్‌క్లబ్బు ఇంకనేకనేక క్లబ్బుల్లో లాడ్జిల్లో డాక్టర్లు యాక్టర్లు మినిష్టర్‌లు క్యాప్టెన్‌లు మేజర్లు ఇన్స్‌పెక్టర్ జనరల్లు -పెత్తందార్లు, సేట్లు, భూస్వాములు పత్తాలేకాదు పదిదందాలు చేసినా పట్టే మొగోడేలేడు

దీనిలోని గుట్టేందో - తెలుసుకోరకూలన్న
దీనిలోని గుట్టేందో - తెలుసుకోర కూలన్న ॥నిజం॥

వ॥ ఏండ్లనుండి సర్వీసులో ఉన్న పోలీస్ కానిస్టేబుల్‌కు కడుపునిండ తిండిలేదు. కట్టనీకి బట్టలేదు - పహాలీకి ముందు వస్తులుంటుంటాడు - కొత్తగా వొచ్చిన అమీన్‌సాబ్ యాడాది నిండకముందే యెన్నో బంగ్లాలు భూములు బటువులు సైకిల్ మోటర్లు సంపాదిస్తాడు-

దీనిలోని నిజమేందో - తెలుసుకోర కూలన్న
దీనిలోని నిజమేందో - తెలుసుకోర కూలన్న ॥నిజం॥

వ॥ కొలువుకని ఆఫీసులు తిరిగితే చిట్టి ముట్టిలేకుంటే పొట్టే కావాలంటరన్న - లంచం తీసుకునే వాళ్ళంత న్యాయం ధర్మం గురించి సదువుకున్నోళ్ళె - ఎమ్మే, ఐఎఎస్, ఐపిఎస్, డాక్టర్ డిగ్రీలు ఉన్నోళ్ళె- దొంగలను కాపాడే గజ దొంగలువీళ్ళె-

వీళ్ళ సదివి.దంతా - గాడ్దిగుడ్డె కూలన్న
వీళ్ళకున్న తెలివంతా - తెడ్డేరా రైతన్న ॥నిజం॥

వ॥ ఓట్లకాలం వొస్తే ముక్కు మొఖం తెలియని నాయకులంతా ఇంటింటి కొచ్చి తమ కథ చెప్పుకుంటారు - అదీ ఇదీ ఏదేదో

చేస్తామని వాగ్దానాలు చేస్తారు - ఎలక్షన్లల్లో గెలిసినంక సీట్ల
మీద కూర్చొని ప్రజలకు బూట్లు చూయిస్తారు-

ఈ నాయకుల ఆటేందో - తెలుసుకోర కూలన్న
ఈ నాయకుల ఆటేందో - తెలుసుకోర కూలన్న ॥నిజం॥

వ॥ వాడ వాడల రేషన్ షాప్‌లు ఉన్నాయి - బియ్యం కావాలంటే
చెక్కెరి దొరుకుతుంది - చెక్కెరి కావాలనుకుంటే బియ్యం
దొరుకుతాయి - ఆలుమగలు పిల్లలుగలిసి మొత్తం ఐదుగురు
ఉన్న సంసారానికి నెలకు రెండు కిలోలిస్తున్నరు - ఊర్లోని
పెద్ద పెద్దోళ్ళకు సంచులనిండ బియ్యం దునియ సామాను
సరఫరా ఐతుంది-

దీనిలోని మాయేందో - తెలుసుకోర కూలన్న
దీనిలోని మాయేందో - తెలుసుకోర కూలన్న ॥నిజం॥

వ॥ పోరాటం లేకుండా చరిత్రిలో మార్పేమీలేదు - ఇవన్నీమారా
లంటే ప్రజాపోరాట మొక్కటే మనకు మార్గమన్న -

అందుకె నడుంగట్టి - నడువాలి కూలన్న
ఆయుధాల్ చేతబట్టి - కదలాలి రైతన్న ॥నిజం॥

---

( 24 వ పేజీ తరువాయి )

కొన్నది. అందుచేత అవి తమలోతాము యుద్ధానికిదిగి పరస్పరం బలహీనపరుచుకోవ డం అనేది నివారింపబడింది. అగ్రిశ్రేణి కాపిటలిస్టు మేధావులు రెండు ప్రపంచయుద్ధాల నుండి అవియాపత్తు పెట్టుబడిదారీప్రపంచానికి తెచ్చిపెట్టిన వినాశనంనుండి గుణపాఠాలు నేర్చుకున్నారు. అందుచేత పెట్టుబడిదారీ దేశాలను తమలోతాము యుద్ధానికి దింపడా నికి వారు సాహసించరు. ఈ కారణాలన్నింటివలన పెట్టుబడిదారీ దేశాల మధ్య యుద్ధాలు యింకెంతమాత్రమూ అనివార్యంకాదని వారు అనుకుంటున్నారు.

ఈ కామ్రేడ్సు పొరపాటు పడుతున్నారు. వారు పైపై విషయాలనుమాత్రమే చూస్తున్నారు. బలీయమైన అసలు శక్తులను వారు గమనించడంలేదు. ఇప్పటివరకు సూక్ష్మరూపంలో పనిచేస్తున్నప్పటికీ సంఘటనల పరిణామాన్ని నిర్ణయించేది అవి మాత్రమే.

పైపై చూపులకు అంతా సజావుగానే సాగిపోతున్నట్లుగా కనిపిస్తుంది. పశ్చిమ యూరప్, జపాన్, తదితర పెట్టుబడిదారీ దేశాలపై అమెరికా కొన్ని పరిమితులను విధించింది. పశ్చిమజర్మనీ, ఫ్రాన్సు, ఇటలీ, జపాను, అమెరికా చేతుల్లోచిక్కి దాని ఆజ్ఞలకు శిరసావహిస్తున్నాయి. అయినా ఎల్లకాలం ఇలాగే సాగిపోతుందని అనుకోవ డంగానీ, యీ దేశాలు అమెరికా పెత్తనాన్నీ, పీడనను ఎల్లకాలం సహిస్తాయనిగానీ, అమెరికా బంధాలను తెంపుకొని, స్వేచ్ఛాభివృద్ధిపంథాను చేపట్టవనిగానీ అనుకోవడం పొరపాటు.

ఉదాహరణకు మొదట బ్రిటను, ఫ్రాన్సులను తీసుకుందాం. నిస్సంశయంగా అవి సామ్రాజ్యవాద దేశాలు. చౌకధరలకు ముడిసరుకులు, నమ్మకమైన మార్కెట్లు వాటికి నిస్సంశయంగా ముఖ్యాతిముఖ్యమయిన విషయాలు. ఇప్పుడేం జరుగుతున్నది? "మార్షల్ప్లాను సహాయం" ముసుగులో బ్రిటన్, ఫ్రాన్సుల ఆర్థికవ్యవస్థలలోకి అమె రికావారు చొచ్చుకొని వస్తున్నారు వాటిని అమెరికావ్యవస్థకు అనుబంధంగా తయారు చేయాలని ప్రయత్నిస్తున్నారు. బ్రిటిష్, ఫ్రెంచివలసలలో అమెరికాపెట్టుబడి ముడి సరుకులను, మార్కెట్లను వశపరచుకొంటున్నది. తద్వారా బ్రిటిష్, ఫ్రెంచి కాపిట లిస్టుల అధికలాభాలకు ప్రమాదం ముంచుకొచ్చింది. ఈ పరిస్థితిని వారు ఎల్లకాలం సహిస్తారని ఊహించగలమా? పెట్టుబడిదారీ బ్రిటను, తదుపరి పెట్టుబడిదారీ ఫ్రాన్సు అమెరికా విషకౌగిలినుండి విడివడి ఒక స్వతంత్రప్రతిపత్తిని సాధించుకోవడానికి, అంటే అధికలాభాలకొరకు, దానితో సంఘర్షణలోనికి దిగుతాయని అనుకోవడం వాస్త వానికి దగ్గరగా లేదా?

ఇక ముఖ్యమైన ఓడిపోయినదేశాలు జర్మనీ, జపానుల విషయంచూదాం. ఈనాడు అవి అమెరికా సామ్రాజ్యవాదపు యినుపపాదాలకింద నలిగిపోతున్నాయి. ఆదేశాలలోని పరిశ్రిమలు, వ్యవసాయం, వ్యాపారం, అంతర్గత విదేశాంగ విధానాలు, ఆ మాటకువస్తే వాటి జీవితంయావత్తూ అమెరికా ఆక్రిమణ "ప్రిభుత్వ"పు కోరికలకు అనుగుణంగా మలచబడుతున్నాయి. కాని కొద్దికాలంక్రితం ఇవి యూరపు, ఆసియాలలో బ్రిటన్, అమెరికా, ఫ్రాన్సుల ఆధిపత్యాన్ని సవాలుచేసిన బ్రహ్మాండమైనసామ్రాజ్యవాదదేశాలు. ఈ దేశాలు మళ్ళీ తలఎత్తి నిలబడవనీ, అమెరికా "ప్రిభుత"ను ధ్వంసంచేయడానికి ప్రియత్నించవనీ, స్వేచ్ఛాభివృద్ధిమార్గాన్ని చేపట్టవనీ అనుకోవడం అద్భుతాలను విశ్వసించడమే అవుతుంది.

పెట్టుబడిదారీ దేశాలమధ్యనున్న వైరుధ్యాలకంటె పెట్టుబడిదారీ విధానానికీ, సోషలిజానికీ మధ్యనున్న వైరుధ్యమే బలవత్తరమైనదని అంటున్నాం. సిద్ధాంతరీత్యా బహుశ అది నిజమేకావచ్చును. అది యీనాడేకాదు రెండవ ప్రపంచయుద్ధానికిపూర్వం కూడా సత్యమే. పెట్టుబడిదారీదేశాల నాయకులు ఏదో కొంతమేరకు దానిని ఆచరణలో సాధించారుకూడా. అయినప్పటికీ, రెండవ ప్రిపంచయుద్ధం రష్యాతో యుద్ధంగా మొదలుగాలేదు. పెట్టుబడిదారీదేశాలమధ్య యుద్ధంగానే ప్రారంభమైంది. ఎందుచేత? ఒకటి కాపిటలిస్టువ్యవస్థకు, సోషలిస్టుదేశమైన రష్యాతో యుద్ధం, పెట్టుబడిదారీదేశాల మధ్య యుద్ధంకంటె ప్రిమాదకరమైనది. ఎందుచేతనంటే పెట్టుబడిదారీ దేశాలమధ్య యుద్ధంలో యితరదేశాలపై కొన్ని పెట్టుబడిదారీదేశాల ఆధిక్యత సమస్య అవుతుంది. రష్యాతో యుద్ధం అంటే పెట్టుబడిదారీవ్యవస్థ యొక్క ఉనికియే సమస్య అవుతుంది. రెండు పెట్టుబడిదారులు తమ ప్రచారం నిమిత్తం సోవియట్ యూనియన్ దురాక్రిమణపూరిత స్వభావాన్ని గురించి అల్లరిచేస్తున్నప్పటికీ అది దురాక్రిమణపూరితమైనదని వారే భావించడంలేదు. సోవియట్ యూనియన్ శాంతియుత విధానం వారి గమనంలోవుంది. అది తనంతటతాను పెట్టుబడిదారీ దేశాలపై దాడిచేయదని వారెరుగుదురు.

ఈనాడు కొందరు కామ్రేడ్సు జపాను, జర్మనీలపని అయిపోయిందని భావిస్తున్నట్లుగానే మొదటిప్రిపంచయుద్ధం ముగిసినతర్వాత జర్మనీపని అయిపోయిందని అనుకోవడం జరిగింది. అమెరికా యూరపును చెప్పుచేతుల్లో వుంచుకుంటున్నదని, జర్మనీ మళ్ళీ తలయెత్తుకొని నిలబడజాలదనీ, పెట్టుబడిదారీ దేశాలమధ్య యుద్ధం ఇక జరగదనీ పత్రికల్లో గొడవగొడవగారాశారు. అయినప్పటికీ జర్మనీ తన బంధాలనుతెంచుకొని, స్వేచ్ఛాభివృద్ధిమార్గాన్ని చేపట్టి, ఓటమితర్వాత పదిహేనుసంవత్సరాల కాలంలోనే ఒక

బలీయమైనశక్తిగా తయారయ్యింది. ఇక్కడొక ముఖ్యమైనవిషయమేమంటే జర్మనీ ఆర్థికంగా కోలుకోవడానికీ యుద్ధానికి సంబంధించిన ఆర్థికవనరులను యితోధికంచేసుకోవడానికీ సహకరించింది బ్రిటన్, అమెరికాలే. బ్రిటను, అమెరికాలు జర్మనీఆర్థిక పునరుజ్జీవనానికి సహాయంచేసింది యీవిధంగా కోలుకొని బలపడిన జర్మనీని సోవియట్ యూనియన్పైకి ఉసిగొల్పడానికి, అంటే సోషలిస్టు మాతృభూమికి వ్యతిరేకంగా ఉపయోగించే ఉద్దేశ్యంతో మాత్రమే- అయితే జర్మనీ ప్రప్రథమంగా తన బలగాలను ఇంగ్లండు- ఫ్రాన్సు- అమెరికా సంఘటనపై కేంద్రీకరించింది. హిట్లరు జర్మనీ సోవియట్ యూనియన్పై యుద్ధం ప్రకటించినపుడు యీ ఇంగ్లండు- ఫ్రాన్సు- అమెరికా సంఘటన హిట్లరు జర్మనీతో చేరడం అటుంచి, దానికి వ్యతిరేకంగా రష్యాతో ఐక్య సంఘటనలో చేరవలసి వచ్చింది.

తత్ఫలితంగా కాపిటలిస్టు ప్రపంచానికీ, సోషలిస్టు శిబిరానికీ మధ్యనున్న వైరుధ్యంకంటె మార్కెట్లకొరకు పెట్టుబడిదారీదేశాల పోరాటం తమ ప్రత్యర్థులను నాశనం చేయాలనేకాంక్ష బలవత్తరమైనదని ఆచరణలో తేలిపోయింది.

ఐనప్పుడు జర్మనీ, జపానుదేశాలు మళ్ళీ లేచి నిలబడవనీ అమెరికాబంధాలను బద్ధలుచేసుకొని స్వతంత్ర జీవనం సాగించడానికి ప్రయత్నించవనీ గ్యారంటీఏమున్నది? అటువంటి గ్యారంటీ యేమీలేదనే అనుకుంటాను.

అందువలన పెట్టుబడిదారీ దేశాలమధ్య యుద్ధాలు అనివార్యంఅనే వాదం నిలబడుతుంది.

శాంతిని పరిరక్షించడానికీ, మరోప్రపంచయుద్ధానికి వ్యతిరేకంగానూ యీనాడు బలీయమైన శక్తులు ముందుకు వచ్చాయి కొబట్టి సామ్రాజ్యవాదం అనివార్యంగా యుద్ధాలకు దారితీస్తుందనే లెనిన్ సిద్ధాంతానికి కాలం చెల్లిందని అంటున్నారు. అది వాస్తవం కాదు.

ఈనాటి శాంతి ఉద్యమం లక్ష్యం శాంతిని కాపాడడానికి, మరో ప్రపంచ యుద్ధాన్ని నివారించడానికీగాను విస్తృత ప్రజానీకాన్ని పోరాటానికి సంసిద్ధం చేయడం. అందుచేత యీ ఉద్యమం లక్ష్యం పెట్టుబడిదారి వ్యవస్థను కూలద్రోసి సోషలిజాన్ని స్థాపించడంకాదు. శాంతిని కాపాడాలనే ప్రజాస్వామిక లక్ష్యానికి అపరిమితమవుతుంది. ఈ విషయానికి సంబంధించి యీనాటి శాంతి ఉద్యమానికి మొదటి ప్రపంచ యుద్ధంనాటి ఉద్యమానికీ తేడావుంది. ఆనాడు సామ్రాజ్యవాదయుద్ధాన్ని అంతర్యుద్ధంగా మార్చడం మన లక్ష్యం. అది సోషలిస్టులక్ష్యాన్ని నెరవేర్చడానికి కృషిచేసింది.

కొన్ని పరిస్థితులలో యీ శాంతిపోరాటం అక్కడక్కడ సోషలిజంకొరకు పోరాటంగా పరిణమించవచ్చును. ఐతే అప్పుడు అది యీనాటి శాంతి ఉద్యమంగా ఉండదు. అది పెట్టుబడిదారీ వ్యవస్థను కూలద్రోసే ఉద్యమమవుతుంది.

బహుశ జరగబోయేదేమంటే శాంతినికాపాడే ఉద్యమంగా నేటి శాంతి ఉద్యమం జయప్రదమయినట్లయితే ఒక ప్రత్యేకమైనయుద్ధం నివారింపబడుతుంది. లేకపోతే అది తాత్కాలికంగా వాయిదాపడవచ్చును. ఏదైనా ఒక నిర్దిష్టమైన ప్రాంతంలోనో, దేశాలమధ్యనో శాంతిని కాపాడగలగవచ్చును. ఎక్కడైనా అధికారంలోని యుద్ధోన్మాద ప్రభుత్వం రాజీనామాచేసి దానిస్థానంలో తాత్కాలికంగా శాంతిని కాపాడడానికి సిద్ధపడిన ప్రభుత్వం అధికారంలోనికి రావచ్చును. అది జరిగితే మంచిదే. చాల మంచిదికూడా. అయినప్పటికీ పరిస్థితిలో మార్పురాదు. పెట్టుబడిదారీ దేశాలమధ్య యుద్ధాలు అనివార్యంగావచ్చే అవకాశాన్ని అది రూపుమాపజాలదు. ఎందుచేతనంటే శాంతి ఉద్యమం ఎన్నివిజయాలు సాధించినప్పటికీ సామ్రాజ్యవాదం జీవించే ఉంటుంది. అందువలన యుద్ధాల అనివార్యతకూడా వాస్తవంగానే ఉంటుంది.

యుద్ధాల అనివార్యతను తొలగించాలంటే, సామ్రాజ్యవాదాన్ని రూపుమాపడం యెంతైనా అవసరం.

ఫిబ్రవరి 1—1952

---

కథ :

# కల్చర్

బి. టి. రామానుజం

"ఇంత వానలో యిక వెళ్లటం పడదు" అనుకొన్నాడు కేశవరావు. వాన చూస్తే పూరూ వాడా ఏకంచేసేలా వుంది. రోడ్డంతా ఎర్రనీటి మయం. కేశవరావు వాలు కుర్చీలో కూచుని, వాన చూస్తూ వుండిపోయాడు. అతన్ని అలా కుర్చీలోకు దేసి చుట్టూ గోడలు కట్టేసినట్లు, దాంట్లో ఒదిగి, ముడుచుకుని కూర్చున్నాడు.

ఇల్లంతా గోల. ఒక్క క్షణం నిశ్శబ్దంగా వుండదు. వానపడితే యిల్లు యిల్లంతా కారుతుంది.

చలి.

చిన్నగా తుంపర వచ్చిపడింది.

ఉలికిపడి చూశాడు కేశవరావు.

'అక్కడ'.. అనుకొన్నాడతను—

—అక్కడ,

యిల్లు విశ్రాంతిగా, నిశ్శబ్దంగా వుంటుంది; అప్పుడప్పుడూ ఫోన్ల మోత తప్పించి, చలువరాయి నేల పాదాలకి తగుల్తుంటే, ప్రాణం లేచి వచ్చినట్లు హాయిగా వుంటుంది. మెత్తని సోఫాల్లో కూర్చుంటే శరీరానికి అలసట అన్పించదు. చప్పుడు చెయ్యకుండా తిరిగే సీలింగ్ ఫాన్ చల్లని గాలి యిస్తుంటుంది. గోడలో, బయటకు కన్పించకుండా అమర్చిన రేడియోగ్రాం యిచ్చే సంగీతం ఎంతో మధురంగా ఉన్నట్లు అన్పిస్తుంది. అక్కడ లైట్లు? లైట్లు కూడాను. వెన్నెల్లా వుంటుందికాంతి. ఆగదుల్లో కూర్చొని సంగీతం వింటుంటే, ఓ క్షణం యీలోకం అంతా మర్చిపోవచ్చు. అప్పుడప్పుడూ, అరక్షణం అలాంటి అనుభవాలు పొందాడు కేశవరావు. అనుక్షణం గుర్తు వచ్చే ఈలోకపు నగ్నసత్యాలు— అవి అతన్ని ఈలోకాన్నిదాటి పోనిచ్చేవికావు.

'అలాంటి జీవితాలు అందరివీకావు. ముఖ్యంగా తనలాంటివాళ్ళవికావు. తను–తన జీవితం— ముళ్ళడొంక. అనుక్షణం వేధించే సమస్యలమధ్య చిత్రవధ అవుతున్న మనిషి తను. ఈ బాధల మధ్యనుంచి, సమస్యలనుంచి ఓ క్షణం వూపిరిపీల్చుకోడానికి,

ఒక రవ్వ ధైర్యం పొందటానికీ— అంతేకాదు వాటి కారణాలు ఎనలైజ్ చేసి, ఎత్తి చూపించడానికీ, ఒక పెన్ను— అదీ నాల్గుసంవత్సరాలకిత్రితం రెండురూపాయలు పెట్టి కొన్నది, రఫ్ కాపీలు రాయడానికి బ్రౌన్ పేపర్లు యింత అశాంతిమధ్య ఓ క్షణం బలవంతంగా తీరిక కల్పించుకొని, ఉద్రేకాన్ని అదుపులోపెట్టుకొని, కయితాలమీదరాసే అక్షరాలు.

అక్షరాలు— అక్షరాలు.

మనుషుల బాధలకి ప్రతిబింబాలుగా, అన్యాయాలనూ, మోసాలనూ, సుఖాలనూ కష్టాలనూ చూపించడానికీ, ఆలోచించడానికీ ఆలోచింపజెయ్యడానికీ. ఈ అక్షరాల పొందిక.

'యింకు'ని పీల్చేసే కాయితాలమీద, చెదిరిపోయిన అక్షరాలు. అవేనా ? చెదిరిపోయి, బెదిరిపోయిన పీల్చివెయ్యబడిన జీవితాలకు ప్రతిబింబాలు ?

కారు హారన్ వినబడింది.

"సార్ !"

"ఆఁ !" కేశవరావు ఈ లోకంలోకి వచ్చాడు.

ఖాకీ బట్టల మనిషి— యూనిఫారంలో రెయిన్‌కోటు, టోపీ— వానలో అతన్ని తడవకుండా చేస్తున్నాయి.

"మిమ్మల్ని తీసుకురమ్మన్నారు..."అన్నాడతను.

"ఆ...వస్తున్నా; నే వెళ్తున్నా—" అని యింట్లోచెప్పి బయల్దేరాడు కేశవరావు. కారు బ్యాక్‌సీట్లో కూర్చుంటూ—

"వాన—" అనుకొన్నాడు.

కారు కదిలింది.

కేశవరావు జీవితంలో కారు ఎక్కడం అది చాలనే తక్కువమార్లు జరిగే సంఘటన. ఇలాంటి సంఘటనలు నిజానికి కొందరికి సుఖాన్నివ్వాలి. కానీ, సుఖమూ— దుఃఖమూ కల్సిన అనుభూతి యిలాంటప్పుడు కేశవరావుని వెంటాడుతుంది.

కారు ఎప్పుడు ఆగిందో—

ఆగగానే ఓ మెరుపు మెరిసింది.

కేశవరావు ఒక్కసారి కళ్లుమూసి, తెరిచి,

"అప్పుడే వచ్చేశాం ?" అన్నాడు. కారు పోర్టికోలో ఆగివుంది.

డ్రయివర్ ముందునడుస్తూవుంటే కేశవరావు వెనక నడిచాడు. జేబులోంచి రుమాలుతీసి ముఖం తుడుచుకొన్నాడు.

ముందు హాలు.

హాలులో సోఫాలూ, టీపాయ్ వున్నాయిగానీ మనుషులెవరూ లేరు.

కేశవరావు సందేహంగా డ్రయివర్‌వంక చూశాడు. సాధారణంగా కేశవరావు ఆ గదిలోనే కూర్చుని వుండటం జరిగేది. యివాళ అక్కడ ఎవరూ లేరు.

"మేడ మీద వున్నారు–" అన్నాడు డ్రయివర్.

'మేడమీద...' అనుకొన్నాడు కేశవరావు. మేడ మీద–

'ఎయిర్ కండిషన్డ్ రూమ్' వుంది. కేశవరావు ఆ గదిలోకి ఒకటి రెండుమార్లు కన్నా ఎక్కువమార్లు వెళ్ళివుండడు.

మేడ మీదకి మెట్లు హాల్లోంచే వున్నాయి. మెట్లు ఎక్కుతుంటే "భవ్వ్–"మని అరుపు విన్పించింది.

తొట్రుపడ్డాడు కేశవరావు.

"నువ్ తిన్నగా మేడమీదకే వచ్చేస్తున్నావేమిటి?" అని కుక్క హెచ్చరించి నట్లనిపించిందతనికి.

ఈ కుక్కలు మేలుజాతివిట! ఓ పట్టాన లొంగవు రోజూ మనుషులు తినే ఆహారం వాటికి ఏమూలకీ చాలదు. శుభ్రమైన మాంసం కావాలి. కట్టిన యినుప గొలుసుల్ని ఏక్షణాన్నయినా తెంపుకొంటాయన్నట్లు బలిసివుంటాయి. అవతల వాడు కొత్తవాడయితే, 'భవ్'మని (భయంకరంగా) అరుస్తాయి. ఆ ప్రాణికి యిలాంటి కుక్కలు కొత్తఅయి పారిపోవడానికి ప్రయత్నం ఏదయినా చేశాడా? చాలు. ఆమనిషి కండ వూడివచ్చిందన్నమాటే! అంత ప్రభుభక్తి వాటికి. తెలివైన మనిషైతే, కుక్క మీదికి వచ్చినప్పుడు బొమ్మలా నిలబడిపోవాలి. కుక్క ముందే నిల్చుని 'భయంకరంగా' అరుస్తుంది తప్పించి, కండలు వూడలాగదు. యజమాని తాలూకు వాళ్ళైవ రైనావచ్చి,

"టామీ, వెళ్లు"అని ఆజ్ఞ యివ్వగానే వెనక్కి వెళ్ళిపోతుంది.

ప్రస్తుతానికి యిక్కడవున్న మేలుజాతి కుక్కఅరవడం కేశవరావునిచూసికాదు. ఎందుకు అరిచిందోగానీ, అరిచింది.

కేశవరావు తొట్రుపాటునుంచి సర్దుకొంటూ, స్వింగ్ డోర్ తోసుకొని గదిలో ప్రవేశించాడు.

గదిలో హాయిగా వుంది.

"అలాగే... నోనో... నేను తప్పకుండా చూస్తానుగా..." మూసివున్న గ్లాస్ విండోషట్టర్స్‌లోంచి అవతల కనబడుతున్న దృశ్యాన్ని చూస్తూ, వయ్యారంగా టేబుల్ మేద ఓ మోచెయ్యి ఆనించి, రెండోచేత్తో టెలిఫోనువైరు మెలిక తిప్పుతూ, ఫోనులో మాట్లాడుతోంది ఇందిరాదేవి.

స్వింగ్‌డోర్ నిశ్శబ్దంగా మూసుకొంది. బయట అంతా చలిగావుంటే ఇక్కడ ఆ ఫీలింగ్ కలగటంలేదు. కేశవరావుకి వెచ్చగా అన్పించింది.

రిసీవర్ క్రెడిల్‌మీద వుంచేస్తూ, వెనక్కి తిరిగింది ఇందిరాదేవి.

"అరె-! వచ్చేశారే-" అందామె మళ్ళీ.

"కూర్చొండి. ఈయన యిప్పుడే వచ్చేస్తారు" అంది. గదిలో పేము కుర్చీ లున్నాయి. వాటిలో మెత్తటిదిళ్లు; పూలపూలడిజైన్లు కుట్టిన గలీబులు తొడిగివున్నాయి. గుండ్రని టీపాయ్‌మీద అద్దం బిగించివుంది. ఉర్రీకూడా, అలంకరణలో ఓభాగంలా అందంగా, నీట్‌గా వుంది. కింద పరిచివున్న కార్పెట్ ఎర్రగావుంది.

కేశవరావు కూర్చుంటూ, ఇందిరాదేవి వంక చూశాడు. ఇందిరాదేవికి ముప్ఫయిరెండు- ముప్ఫయి మూడేళ్ళు మించవు. సింప్లిసిటీ ఉట్టి పడేలా అతి నాజూకుగా అలంకరించుకొంటుంది. కదలికల్లోనూ, మాట్లాడటంలోనూ నాజూకుతనం ప్రదర్శించడానికి ప్రయత్నిస్తున్నట్లు కనబడనివ్వదు.

కేశవరావు పక్క కుర్చీలో కూర్చుంటూ,

"వెధవవాన" అంది. కుడిచేతికి కట్టుకొన్న, పెద్దవాచీ చూసుకొంటూ, కొంచెం కంగారు పడ్తున్నట్లుగా,

"డామ్‌హెల్ - సిక్సవుతోంది-" అంది. కేశవరావు మాట్లాడలేదు. అతను సర్దుకొని కూర్చొనడానికి ప్రయత్నిస్తున్నాడు. కుర్చీలో దిళ్ళు మెత్తగానే వున్నాయి. పేము కుర్చీ హాయిగా కూర్చోడానికి వీలుగానే వుంది. గదిలో వాతావరణం ప్రాణానికి హాయిగొలపాలి. కానీ, కేశవరావు ఏదో, 'ఆనీజీనెస్' ఫీలవుతున్నాడు. అదే మిటో తెల్సుకోడానికి ప్రయత్నిస్తున్నాడు.

ఇందిరాదేవి ఏదో అంటోంది.

కేశవరావుకి ఆ మాటలు బుర్రలోకి ఎక్కడం లేదు. షట్టర్స్ మీద వాన చినుకులుపడి, టపటప శబ్దం అవుతోంది. గ్లాస్ మసగ్గా తయారవుతోంది.

మసక-మసక,..జీవితాలు. మసక జీవితాలు. ఆ జీవితాల్లో ఏదీ స్పష్టత వుండదు. ఎందుకు బతికేదీ, ఎలా బతికేదీ - ఏదీ స్పష్టత వుండదు. (యితర్లకి)
ఈ మసక జీవితాల మీద కేశవరావు కథలు రాసాడు. ఆ కథలు అతనికి సంతృప్తి నిచ్చినా యివ్వకపోయినా, ఇతర్లకి నచ్చేయి. కేశవరావుకి వెల్తిగానే వుంటుంది—

ఆ జీవితాల్లో వెల్తి, యితర్లు తెల్సుకొని జాలీ సానుభూతీ చూపితే తీరేదికాదనీ, అసలు ఈ "ప్రపంచం"లో తీరే వెల్తికాదనీ,

క్షణక్షణం సంఘర్షణలో వుండీ ఆ జీవితాలకు, వాళ్ళ సమస్యలకి సానుభూతితో పరిష్కారాలు లభించవనీ, కేశవరావుకి తెల్సు.

"ఈ కథల్లో జీవితాలని చాలాబాగా ప్రతి బింబించారు—" అంటారెవరో.

వెల్తి జీవితాల ప్రతిబింబాలు చిత్రిస్తే, కేశవరావుకి వెల్తి తీరదు. అతను కథలు రాస్తాడు, సంఘటనలని చిత్రిస్తాడు. సమస్యలు చూపిస్తాడు, పరిష్కారంవంక దారి చూపించడానికి ప్రయత్నిస్తాడు. జీవిత సత్యాల్ని అర్థమయేలా ఇతర్లకి తెలియ జెయ్యడానికి కృషి చేస్తాడు.

ఎంత చేసినా—

జీవితం జీవితంలానే వుంటుంది.

ఎంత రాసినా యింకా జీవితం మిగిలే వుంటుంది. ఆ మిగిలిపోయిన జీవితంలో సంకోచాలు, జాలి-అధైర్యం; వాటి పాళ్ళు వాటికి వుండనే వుంటాయి.

కథలు పత్రికల్లో పడతాయి.

కొన్ని అతను ముందే ప్రత్యేకంగా కొందరి దగ్గిర చదువుతాడు. అదో సంతృప్తి. అందులోంచి అతనికేం లాభిస్తుందో, అసలు లాభమే పొందుతాడో నష్టమే భరిస్తాడో.

కేశవరావుకీ లాభనష్టాల బేరీజు తెలీదు.

అందుకని

అందుకనే—

పీడితుల దైన్యాన్ని గురించి రాస్తే పీడకులు కూడా "ఆహా, ఓహో—" అని మెచ్చుకుంటున్నప్పుడు, అతనెందుకో తనే తప్పుచేసినట్లు ఫీలయేవాడు. వీళ్ళు తన రైటింగ్స్‌లో, టెక్నిక్‌నీ, స్టైల్‌నీ మెచ్చుకొంటున్నారో, లేకపోతే తన 'పర్సస్'తో ఐడెంటిఫై అవుతున్నారో అతనికి సందిగ్ధం. లేకపోతే ఎలకల ప్రాణసంకటం వీళ్ళనీ 'ఎంటర్‌టెయిన్' చేస్తున్నాదా ? అని అతనప్పుడప్పుడు తర్కించుకుంటూంటాడు.

"యీవేళ మాకు విందు భోజనం అన్నమాట" ఇందిరాదేవి అన్నమాటలకు వులిక్కిపడి చూశాడు కేశవరావు.

చిన్నగా నవ్వి వూరుకున్నాడు.

"వీళ్ళు రావాలే– సుబ్బారావుగారని– ఒకాయన వచ్చారు. యివాళ ఆయన వస్తారనుకొంటా–" అందామె.

కేశవరావుకి ఈ సుబ్బారావు ఎవరో తెలీదుకాని ఇలాంటి సుబ్బారావుల్ని చాలా మందిని అతను వాళ్ళ మూలంగా కల్పుకొన్నాడు. మళ్ళీ ఇందిరాదేవే అంది.

"ఇరవై నాలుగ్గంటలూ ఈ బిజినెస్ తోనే సరిపోతుంది. ఓ క్షణం హాయిగా మంచి లిటరేచర్ చదువుకుందామంటే తీరిక దొరికి చావదు. ఆ ఫోను ఒకటి–బొ౦య్ మంటూనే వుంటుంది. రాంగ్ నెంబర్లు– ఏవో వెధవ రికమెండేషన్లూ–

"పొద్దున్న ఎనిమిదవటం భయం– రాత్రి పదకొండు వరకూ యిదే గొడవ.

"దేనికయినా వుండాలి లెండి. సుబ్బారావుగారని చెప్పానే, ఆయన విచిత్రమైన మనిషి. అంతకన్నా "బైంమనిషి" అంటే బావుంటుంది. అదేవిటో ఆయన బిజినెస్‌నీ కేర్ చెయ్యడు. "ఏముందండీ బిజినెస్ పుత్త స్పెక్యులేషను. వస్తే ఓలక్ష యిటు లేకపోతే అటు. ఈ మాత్రిందానికే అనవసరపు రొష్ఠు ఎందుకు" అంటాడు. బైర్ల కంపెనీలకి కోటాలూ రికమండేషన్లూ యితనిద్వారానే జరుగుతాయి. బైర్ల బిసినెస్ చేసేవాళ్ళకి యితని అవసరం మరి– వేలు ఖర్చు పెడతారు యితని గురించి... అదిగో, రానే వచ్చారు"

అంది ఇందిరాదేవి

కేశవరావు అటుగా చూశాడు.

స్వింగ్‌డోర్ తోసుకొంటూ రాజారావు వచ్చాడు. అతని వెంట వచ్చిన వ్యక్తి బహుశ సుబ్బారావు అయుండాలి! అనుకొన్నాడు కేశవరావు.

"ఇదిగో– యిక్కడేవున్నారు!" అన్నాడు రాజారావు.

కేశవరావుని చూస్తూనే అతని ముఖం చాటంతయింది. కేశవరావు ఓసారి నిలబడ బోతున్నట్లు కుర్చీలో సర్దుకు కూర్చున్నాడు.

"ఆ...ఆ... కూర్చోండి పర్లేదు. ఈయనే కేశవరావుగారు. ఈయన సుబ్బారావుగారు– నాఫ్రెండు" రాజారావు కేశవరావుని వారిస్తూ అన్నాడు,

"ప్లీజ్‌డ్ టూ మీట్‌యూ" సుబ్బారావు చెయ్యి అందించబోయాడు.

కేశవరావు చేతులు రెండూ జోడించి,

"నమస్కారం..." అన్నాడు.

రాజారావూ, సుబ్బారావూ కుర్చీల్లో కూర్చున్నారు.

రాజారావు ఇందిరాదేవి వంక చూస్తూ,

"పాపాయి రాలేదు - షాపింగ్‌కి వెళ్ళింది." అన్నాడు.

'పాపాయి' అంటే, రాజారావు చెల్లెలు.

"దానికో పిచ్చి. షాపింగ్ షాపింగ్..." క్లాప్స్ కొడుతూ లేచినుంచుంది, ఇందిరాదేవి తలుపులు తోసుకొంటూ పక్క గదిలోకి వెళ్ళింది.

సుబ్బారావు అంత మాట్లాడే మనిషిలా లేడు. అతను కుర్చీలో వెనక్కి చేరగిల బడి. కేశవరావు వంక పరీక్షగా చూస్తున్నాడు. యిద్దరిచూపులూ కలిస్తే,— చిర్నవ్వు నవ్వుతూ,

"మిమ్మల్ని కలవడం అదృష్టం" అన్నాడు.

కేశవరావుకి అందులో అదృష్టం ఏముందో అర్థం అవలేదు. చిన్నగానవ్వి,

"అదృష్టం ఏముందిలెండి" అన్నాడు సుబ్బారావువంక చూస్తు. సుబ్బారావు నలుపు. నలుపంటే, కారునలుపు కాదుగానీ, నలుపే పెద్దముఖం నుదురూపెద్దదే. కళ్ళ జోడు అద్దాల్లోంచి కళ్ళు పెద్దవిగా కనబడుతున్నాయి. మనిషి ఎప్పుడూ ఖుక్తాయా సంలో వున్నట్లే కనబడతాడు. వెనక్కివాలి కూర్చున్నా, నిటారుగా కూర్చున్నట్లే కన బడతాడు.

"ఈమధ్య చాలాకాలంగా యిటురాలేదు. రాజారావే అంటుండేవాడు, యిటువైపు రమ్మని. ఏదో కాన్ఫరెన్సువుండి వచ్చాను. ఎలావున్నారు? మీగురించి తెల్సుకోవాలని వుందినాకు"

అన్నాడు సుబ్బారావు సిన్సియర్‌గా. అతనిమాటల్లో కేశవరావుకి మంచితనం కొట్టవచ్చినట్లు కనబడింది.

ఓ కాలితో డోర్‌తోస్తూ, ట్రేని రెండుచేతిల్తో పొందికగా పట్టుకుని వచ్చింది ఇందిరా దేవి.

ట్రేలో, నాలుగు ప్లేట్లలో యాపిల్‌ముక్కలు కోసివున్నాయి. ఓ పెద్దప్లేటులో తెల్లద్రాక్షపళ్ళు (మూడు నాలుగు కింగ్‌సైజ్ గుత్తులు) వున్నాయి. టీపాయ్‌మీద ట్రే వుంచుతూ,

"ఈయన గొప్ప గమత్తు మనిషిలెండి. ఓ పట్టాన బయటపడరు" అంది.

"పాపాప్‌కీ, నీకూ నాకూ అర్ధమైపోతే ఈయన రచయిత ఎందుకవుతాడు లెద్దూ"— రాజారావు

కేశవరావుకి ఎందుకో అదోలా తయారయింది. "మనుషులమధ్య ఎక్కువ "యింటిమసీ"వుంటే తక్కువమాటల్తోనే ఎక్కువభావాలు అర్థం అవుతాయట— ఏదో పుస్తకంలో చదివాను—" రాజారావే అన్నాడు మళ్ళీ.

వున్నట్లుండి ఈ రకందాడి ఏమిటో కేశవరావుకి అర్థం అవలేదు.

సుబ్బారావు ఎందుకో, ఉత్సాహంగా ముందుకువంగి, "నువ్వనేది, కేశవరావు గారికీ మీకూ యింటిమసీ లేకపోవడంవల్ల ఆయన అర్థం అవటం లేదనేనా? కానీ నే అనుకొనడం మీ మధ్య ఆ చనువు వుందనే..." అన్నాడు.

ఉత్తినే గాలిలోంచి అన్నమాటలకు సుబ్బారావు నుంచి 'యింటర్‌ప్రెటేషన్' యిచ్చేసినట్లన్పించింది కేశవరావుకి. అతనికి రాజారావు ఈ "యింటిమసీ" గురించి ఎందుకు ఎత్తాడో తెలీదు, కాని, సుబ్బారావు దానికి మంచి ఎనాలిసిస్ ఏదోలాగాడు.

కాసేపు నిశ్శబ్దం.

రాజారావు యిక లేటు ఎందుకన్నట్లు.

"కథ మొదలుపెడదామా?" అన్నాడు. కేశవరావు, జేబులో మడిచివున్న కాయితాలు పైకితీస్తూ.

"పెద్ద సంతృప్తికరంగా రాలేదు" అన్నాడు. కాయితాలు సీరియల్ నెంబర్ ప్రకారం వున్నాయో లేవో చూసుకొంటుంటే, సుబ్బారావు అన్నాడు.

"మీరు క్లియర్‌గా మాకు ఎక్స్‌ప్లెయిన్ చెయ్యాలి. కథలు బాగా అర్థంచేసుకొనేశక్తి నాలో వుందనుకోను."

"మీ కథలు మీరు చదువుతుంటే వినడం ఓ అదృష్టం. అందుకే వీళ్ళనిచూస్తే నాకు జెలసీగావుంది"

రాజారావు ఎగిరిపడినంతపనిచేసి,

"అదే వద్దన్నాను. అసలు కాంప్లిమెంటు ఆయనకి. యిలాగే ఒకాయన..."

"నీ రిఫరెన్సులు చాలించరాబాబూ—"సుబ్బారావు ఆపేశాడు.

కేశవరావు కాయితాలవంక చూసుకొన్నాడు.

అక్షరాలు — అక్షరాలు.

తనురాసినవే.

మర్చిపోవాలనుకొని, మర్చిపోలేని సంఘటనలు.

భరించలేక కాయితాలమీద పెడితే రిలీఫ్‌గా వుంటుందనుకొంటే, తర్వాత మళ్ళీ చదివినప్పుడు ఏదో గుబులు. మనసు కలిచివేసే స్మృతులు.

కేశవరావు అక్షరాలు కూడబలుక్కొని చదవటం మొదలుపెట్టాడు. మొదలు పెట్టిన ఐదు నిముషాలకి ఫోన్ మోగింది.

విసుగ్గా చూశాడు సుబ్బారావు.

ఒక క్షణం ఫోన్ ఆగిపోతుందేమోనని చూసి, యింకా మోగటంవల్ల ఫోన్ ఎత్తాడు రాజారావు.

"హలోవ్. ఆ... లేదు. పాపాయ్ షాపింగ్‌కి వెళ్ళిరాలేదు. రేపు... ఇవాళ కాదనుకొంటాను— వచ్చింతర్వాత రింగప్ చెయ్యమంటాను—"

ఫోన్ పెట్టేస్తూ,

"ప్రమీల" అన్నాడు యిందిరాదేవివంక చూస్తూ. సుబ్బారావు ముందుకువంగి తర్వాత చదవబోయేది వినడానికి సిద్ధంగావున్నాడు.

కేశవరావు ఓసారి అందరివంకాచూసి చదవటం మొదలుపెట్టాడు.

చీకటి కొంతమంది అన్యాయాలు, మోసాలు చెయ్యడానికీ ఉపయోగపడితే, మరికొందరు బతుకుల్లో నైచ్యాన్నీ, దుర్భరత్వాన్నీ తల్చుకొని ఏడవటానికి పనికి వస్తుంది.

అక్కడున్న చీకటి నీలమ్మకి అంతకన్నా ఎక్కువసాయం ఏమీ చెయ్యడంలేదు. దిగులుగా కూర్చున్న ఆమె ముందున్న పొయ్యి, చిన్నగా మంటనిస్తోంది. దానిమీద కుండలో నీళ్లున్నాయిగానీ,— అంతే— అందులోవున్నవి నీళ్ళే.

ఆమెకి జీవితం పరుచుకొన్న చీకటిలా భయంకరంగా తోచింది. ఎన్ని జన్మల పాపాలు కలిసికట్టుగా ఈ జన్మలో ప్రతీకారం తీర్చుకొంటున్నాయో ఆమెకి అర్థం అవడంలేదు.

దేవుడు అన్నీ సృష్టించి, ఈ భయంకరమైన దారిద్ర్యాన్నిగానీ ఆడజన్మనిగానీ సృష్టించడం మానేస్తే బావుండునన్పించి, అమెకి ఏడుపు పొర్లివచ్చింది.

నీలమ్మకి జీవితంలో 'ప్రత్యేకం'గా వచ్చిన కష్టాలులేవు. ఈ ప్రపంచంలో వున్న కష్టాలన్నీ ఆమెకి వారసత్వంలా సంక్రమించాయి. ఇంక వేరేగా కష్టాలు ఎక్కడ్నుంచి వస్తాయి. దేవుడు కసికొద్దీ మరికొన్ని కష్టాలు సృష్టించడం మొదలు పెడితే తప్ప?

ఆరురోజులనుంచీ స్ట్రైకు,

ఆమెభర్త వీర్రాఘవులూ, కొడుకు సన్యాసీ, ఆమె అందరూ సమ్మెచేస్తున్నారు. మరి రోజుకూలీ ఎవరు యిస్తారు? రోజుకూలీ లేకుండా వాళ్ళకి పూటగడవదు. బియ్యంకోసం రోజుకూలీ మాని "క్యూ"లో నిలబడాల్సిన జాతకం వాళ్ళది. అందుకే నీలమ్మ అనుకొంటుంది,

"మాకు సుకం యింక ఒక్క నరకంలోనే"అని.

"డామ్‌హెల్... డర్టీ రెడ్యూన్..."

విసురుగా వచ్చిన మనిషి కథాగమనాన్ని ఆపుజేసింది.

"ఓ...గోష్—"వచ్చిన మనిషి నవ్వుతూ అంది.

"పాపాడ్ వచ్చేసింది"అన్నాడు రాజారావు ఎవరో తెలీనిమనిషికి చెప్తున్నట్లు.

పాపాడ్‌కి యిరవై ఏళ్ళకు తక్కువవుండవు. పేరు దుర్గ. వుమెన్స్‌కాలేజీలో ఆమె బియస్‌సీ. ఆఖరు సంవత్సరం చదువుతోంది. చాల నాజూగ్గా వుంటుందని ఎవరూ చెప్పకుండానే అర్థంఅవుతూవుంటుంది. గాగుల్స్ కొత్తరకంవి ఎప్పటికప్పుడు మారుస్తుంటుంది. ఆవిడకీ, 'లిటరేచర్ అంటే ఎంతో యింట్రెస్టు.' డిసైడ్‌రాబిన్స్ అన్నా, బార్బరా కార్ట్‌లండ్ అన్నా— వాళ్ళ పుస్తకాలన్నా ఆమె ప్రాణం యిస్తుంది. ప్రాణం యిస్తాననే అంటుందికూడా. జపాన్ మోడల్ ట్రాన్సిస్టర్ అంటే పాటలు వచ్చే టైమ్‌లో ఆమెకి ప్రేమ. సిలోన్ ఎన్ని బ్యాండ్లమీద ఎప్పుడు ఎక్కడవచ్చేదీ; వివిధ భారతి పాటలు మధ్యాహ్నం ఎక్కడ వచ్చేదీ, రాత్రి ఎక్కడ వచ్చేదీ, ఆమెకి బాగాతెలుసు. బినాకాలో ఎవరిపాటలు ఏ వారం ఎక్కువ వచ్చిందీ, ఎవరు మ్యూజిక్ స్కోర్ చేసిందీ అన్నీ ఆవిడదగ్గిర రికార్డులు వుంటాయి. వాయిస్ ఆఫ్ అమెరికా కొంచెం ప్రయత్నిస్తే. ట్యూన్ చెయ్యగలదు. కాకపోతే, న్యూస్ వినడానికి ఆమెకి టైం వుండదు. నిజానికి ఆవేళకి ఆమె లేవదు.

"కొత్తపుస్తకాలు వచ్చాయి, 'అవర్ బుక్‌షాప్‌లో' అంది దుర్గ రెండుపుస్తకాలు ఓ కుర్చీలో పడేస్తూ—"

"యివండీ— దాని లిటరరీపీసెస్" రాజారావు పుస్తకాలుతీస్తూ అన్నాడు.

"దట్స్ రాంగ్" అంది దుర్గ "వెరీబాడ్. పుస్తకాలు చదవకుండా మనుషులను అంచనా వెయ్యడం కేశవరావుగార్ని అడగండి—"

కేశవరావు యిబ్బందిగా చూశాడు.

"షటప్! బొత్తిగా మేనర్స్ లేకుండా..."—రాజారావు

"చిన్నపిల్ల—"—సుబ్బారావు.

"మరేమిటి చూడండి. తను మహా ఈ పుస్తకాలన్నీ చదివినట్లు—"

వెక్కిరిస్తూ పక్కగదిలోకి వెళ్ళింది దుర్గ.

"శని!" అన్నాడు రాజారావు 'ముద్దుగా'

కేశవరావు మూడ్ ఎటో పోయింది,

మళ్ళీ చదవటం మొదలుపెట్టాడు.

' వీరరాఘవులూ, సన్యాసీ యిద్దరూ కోపంగా వున్నారు. ఎదురుగా నిలబడి వున్న పూర్ణచంద్రరావు యిదేమీ పట్టనట్లు వున్నాడు.

"చెప్పండి" అన్నారు వాళ్లు.

"ఏమిటి" అన్నాడతను.

"మాకు ఆకలి. ఆకలిమంట"

"మనుషులకి ఆకలి వెయ్యడం ఆరోగ్యలక్షణం" పూర్ణచందరావు 'కూల్'గా నవ్వేడు. ఆ నవ్వు చీకట్లో చాలా వికృతంగావుంది. వికృతమైన నవ్వుచుట్టుఅతను అందమైన సమాధుల పునాదులు వేసుకొంటున్నాడు. అతను కొంచెంగా చలి'ఫీల'వుతున్నాడుగానీ, చుట్టూ వున్నవాళ్ళకి చలిగా లేదు. వాళ్లు ఓ రెండువందల మంది దాకా వుంటారు.

వాళ్ళందరి వేడి వూపిరి వాతావరణాన్ని వెచ్చగా మారుస్తోంది. '

ఫోన్ మోగింది మళ్ళీ.

"హలోవ్" అన్నాడు రాజారావు

"యస్ ప్లీజ్, జస్ట్ వెయిట్ ఎమినిట్" మౌత్‌పీస్‌కి చెయ్యి అడ్డం పెట్టి 'పాపాయ్' అని కేకేశాడు.

"ఎవరు?" అంది ఇందిరాదేవి,

"పాపాయ్ ఫ్రెండెవరో—"

పాపాయ్ పక్కగదిలోంచి వచ్చింది. ఫోను చేతిలోకి తీసుకొని, ఏదోమాట్లాడటం మొదలుపెట్టింది. కేశవరావుకి ఆ భాష అర్థంకాలేదు. ఆమె కొంత ఇంగ్లీషు హిందీ యింకేవో భాషలూ మాట్లాడింది. తర్వాత ఫోన్ పెట్టేస్తూండగా రాజారావు అన్నాడు,

"యిందాక ప్రేమీల ఫోన్ చేసింది"

"డామ్ హెల్! దానికి పనుండదు సినిమాకి రమ్మంటుంది. ఈ తెలుగు సినిమాలు నేను చూడలేనుబాబూ. మొన్నే ఓ హిందీ సినిమా చూశాను" ఎవరికో సంజాయిషీ చెప్తున్నట్లు చెప్తోందామె.

కేశవరావు అసహ్యంగా చూశాడు.

ఒక్కక్షణం ఎందుకో అదోలా అయింది అతనికి. బుర్రసింహా ఒక్కసారి ఆలోచనలు ఈగల్లాముసిరాయి. అతని ఆలోచనలు ఒక్కసారి అతన్నే బాధించాయి.

'ఛీ తను ఎలాంటి జీవితం జీవిస్తున్నాడు? ఎందుకిలా లొంగిపోతున్నాడు?' అనుకొన్నాడు.

"తన 'వీక్‌నెస్' తన్ని తినేస్తోంది. కొన్ని విషయాలు తెలిసీ నమ్మడం ఇష్టం వుండదు. జీవితంలో ఎన్ని సంఘర్షణలువున్నయ్? ప్రతీ శక్తినీ యింకో శక్తి అణిచెయ్యడానికి ప్రయత్నిస్తుంటుంది. ఈ దేశంలో సాహిత్యంమీద ఎన్ని శక్తులు ఎలా పనిచేస్తున్నయ్! ఈ మనుషులు మనసుల్లో వొప్పుకోలేనిది, సాహిత్యంలో మనం చెప్పినప్పుడు వప్పేసుకొంటున్నారు కదా— ఇది తెలిసీ రచయితలు యెందుకు మథ్యపడడం?

కేశవరావుకి బాధవేసింది. ఎప్పుడో ఓసారి జరిగిన సంఘటన అతనికి గుర్తు వచ్చింది.

చాల కాలం క్రితం అతను రాసిన ఓకథ ముగింపు గురించిన గొడవ— వాళ్ళేదో చెప్తారు. అతను వేరేఅనుకొన్నాడు. చివరికి అతను సొంతముగింపు చేసుకొన్నాడు. అప్పుడు వాళ్ళు చెప్పినట్లు ముగించివుంటే ఈనాడు ఆకథ నామరూపాలు లేకుండా, ఎవరికీ పనికిరాని కథ అయుండేది.

"అయితే తనిన్నాళ్లూ— యీ 'క్లాస్ నేచర్' గుర్తించలేదు? ఎందుకులేదు. తన వీక్‌నెస్ అంతా తన్ని మింగింది. ఇంకా ఏదో మంచి లాగుదామనుకొన్నాడు. అంతా వుట్టిది. షో! వాళ్ళంతా షోకి లిటరేచర్ చదివితే మనం షో యివ్వడానికి 'టూల్స్'గా పనికొస్తున్నాం. వందరూపాయలు మన ముఖాన సాహిత్యసేవపేరుతో పడేసి, 'గుడ్‌విల్' సంపాదిస్తారు. వేలు వేలు అన్యాయంగా కూడబెట్టినా ఎవరు కాదనేది? 'యింకా నయం ఆమాత్రిం చేస్టే వుంది కనకే యీ లోకం యిలా వుంది— యీ రచయితలు ఈమాత్రిం అన్నా బతగ్గలుతున్నారంటారు' అననీ! ఎవరు ఎవరినడ్డుపెట్టుకు బతికేదీ యిప్పుడే ఏం తెలుస్తుంది? ఆరునెల్లు సావాసంచేస్తే వారు వీరవుతారుట. కొంపదీసి తను..."

కేశవరావుకి చెమట పట్టింది.

"వొద్దు—" అనుకొన్నాడు.

"తను వాళ్ళకి సాయపడటంకాదు చెయ్యాల్సింది. 'బ్రెయిన్ వాష్ చేయించు కొనేలోగా బయటపడాలి. తనలో జీవం వుండగానే తప్పించుకోవాలి—"

అతనికెందుకో కొంచెం సంతృప్తి అన్పించింది.

"చదవటం ఆపేశారేం—" అన్నారెవరో.

"ఈకొంచెం చదివేస్తే మంచిది"అనుకొన్నాడు అతను.

" 'కష్టించి పనిచేస్తున్నాం బాబూ ఆ బగమంతుడికే దయలేదు. మీరు దయ కొద్దీ మాకీ గంజయినా పోస్తున్నారు. ఏనాడో చావాల్సిన వాళ్ళం ఆ గెంజయినా తాగి మా పేణాలు నిలుపుకొని, మీకు వూడిగం చేస్తున్నాం. బగమంతుడు మీ యింటిని సల్లగా చూడాలి—' వీరారాఘవులు వ్యంగ్యంగా అన్నాడు.

పూర్ణచందరావు గట్టిగా నవ్వి,

'అందుకే ఎడ్జస్టయి పొమ్మంటున్నా. విపరీతంగా'లాస్' వస్తోంది. అదర్‌వైజ్ మీమీద నాకేం కక్ష?"

'ఎడ్జస్టయిపోవడం!' కేశవరావు ఎవరో చెంపమీద కొట్టినట్లు తేరుకొన్నాడు.

తనే—రాసింది.

తనుమాత్రం ఈ రకంగా ఎడ్జస్టవకూడదు. చివరికి తను ఎవరికీ పనికిరాని రచయిత అవుతాడు. అతను గదిచుట్టూ చూశాడు.

ఇందిరాదేవి ఎప్పుడు లేచివెళ్ళిందో— విండోషట్టర్స్ దగ్గిర నిలబడి అవతలకి చూస్తోంది. రాజారావు సుబ్బారావు చెవిలో ఏదో చెప్తుంటే అతను చిన్నగానవ్వు కొం టున్నాడు. కథ ఎవరు వింటున్నదీ కేశవరావుకి అర్థం అవలేదు.

తనెంత బుర్రలేకుండా వాళ్ళ 'ట్రాప్'లో పడి వాళ్ళని నమ్మిందీ అతనికి అర్థం అయింది. వీళ్ల నాతో 'పర్పస్'విషయంలో ఐడింటిఫై అవడంలేదు. నిజం. తన్ను వీళ్లు మిస్ గైడ్ చేస్తారు.

"కేశవరావ్ లేచిపో"అంది మనసు.

"ఉండు" అన్నాడు కేశవరావు.

"ఒద్దు. నీకింక జీవితం కన్పించదు. బయటవానని నువ్ విండోషట్టర్స్‌నుంచే చూస్తావ్. జీవితమూ అంతే."

కేశవరావు గబాల్న నుంచున్నాడు.

"అదేం. కథ ఆపేశారు?"— ఇందిరాదేవి.

"నేను వెళ్లాలి"అన్నాడు కేశవరావు పరోలోకంలోవున్న వాడిలా. "ఒంట్లో బావులేదు. చదవలేను. నేవస్తాను—"అతను కదలబోయాడు.

"అదేమిటి కూర్చోండి. కొంచెం కాఫీతీసుకోండి. తలనొప్పి తగ్గుతుంది. ఫ్లాస్కులో వుంది తీసుకొస్తాను." ఇందిరాదేవి.

రాజారావూ, సుబ్బారావూ బలవంతంగా కేశవరావుని కూర్చోబెట్టారు.

కప్పుతో కాఫీ తెచ్చింది ఇందిరాదేవి.

"వొద్దు వొద్దు. తాగలేను_"

కేశవరావు మాట నెగ్గలేదు.

ఒక సిప్‌చేసి కప్పు కింద పెట్టేస్తూ,

"క్షమించండి సయించడంలేదు. నాకెందుకో బావులేదు_" అన్నాడు.

డోర్సు తోసుకొని బయటకు వచ్చేశాడు.

"ఒక్కసారి అలా అప్‌సెట్ అయిపోతున్నారేమిటి ?" అన్నమాటలు అతను విన్పించుకోలేదు.

"అప్‌సెట్ అవటంకాదు 'సెట్'అవడం"అనుకొన్నాడతను. పోర్టికోలో వున్న కార్లో ఎక్కుస్తూ—

"తర్వాత బావున్నప్పుడు చూడొచ్చులెండి_"అన్నాడు రాజారావు. అతనిముఖం ఎందుకో అదోలా తయారయింది.

డ్రైయివర్ కారు స్టార్ట్ చేస్తుంటే, 'ఒద్దు దిగిపోతాను' అందామనుకొన్నాడు. కానీ కారు బయల్దేరి పోయింది.

కారు బయటికి వచ్చి, రోడ్డెక్కి, సందుమలుపు తిరగ్గానే,

"కారు ఆపెయ్" అన్నాడతను.

కారు తలుపులు, అద్దాలు బిగించేసివున్నయ్. అతనికి కారులో వెచ్చగావుంది. బయట పడుతున్న వాన శబ్దం అతనికి పెద్దగా విన్పించడంలేదు. బయట ఏం వున్నదీ అతనికి స్పష్టంగా కన్పించడంలేదు. దారికూడా మసగ్గానే కన్పిస్తోంది. 'వాళ్ళడ్రైయి వర్'_ అతనే తీసికెళ్తున్నాడు తనని.

అతను కారు ఆపలేదు.

"కారు ఆపెయ్ !" గట్టిగా అన్నాడతను.

చిన్న జర్కుతో కారు ఆగిపోయింది.

"నేదిగిపోతున్నాను_"అనేసి డోర్ తెర్చుకొని బయటకి దూకినంత పన్చేశాడు కేశవరావు.

ఒక్కక్షణంలో వాన అతన్ని తడిపేసింది. జేబులో కాయితాలు జాగ్రత్తగా పట్టుకొన్నాడు. చలి. అయినా కేశవరావు హాయిగానే ఫీలయ్యాడు. వాన చప్పుడు అతనికి విచిత్రంగా ఆనందం కల్గించింది. ఎదురుగావున్నది ఏమిటో అతనికి స్పష్టంగా కనబడుతోందిప్పుడు.

ఫ్రీగా అడుగు ముందుకు వేశాడు కేశవరావు.

# న్యాయం అమ్మకంచేసే న్యాయస్థానం

నిర్మల్

మహాశయా!
నేరం చేశావా? అని అడుగుతున్నావా?
మే మెక్కడున్నాం?

దేశ ఆర్థిక వ్యవస్థను ఆయుధశాలకు అప్పజెప్పి
ఆకలి అని అరిచినవాడిపై ఆయుధాలతో ఎక్స్‌ప్రెర్మెంట్ చేసి
మానవత్వం అంటేనే బూతును విన్నట్లు భయపడే
తిరుగుబాటంటేనే తుళ్ళిపడి ప్రజారాశిని పురుగుల్లాచూచే
కలవాళ్ళ కామందుల కలలనుకాచే
పాలితుల మూల్గులు పీల్చి ప్రజాహంతకులను రక్షించే
దోపిడీ పాలక యంత్రాంగం పరువుకు 'కవర్'లాంటి
ధనానికి అధికారానికి మాత్రమే
బాగా నటించగలవానికి మాత్రమే
అవసరమైన 'న్యాయం' అమ్మకం చేసే
'న్యాయస్థానం' బోర్డు కట్టుకొన్న
అన్యాయస్థానంలో అరెస్టు అయి వున్నాము

తెలిసో, తెలియకో
బతుకు కోసమో, భరించాలనో
ఈ చట్రంలో యిరుక్కొన్న మేధావీ!
నల్లని నీ కోటు ఒక్కసారి చూచుకో
బానిసయుగాల బలప్రయోగంలో
కనలిన బానిసరక్తపు కారునలుపు కనిపిస్తుంది
తెల్లని నీ 'షై'ని తెలివితో తడిమిచూడు
రెండు శతాబ్దాల వలసవాదం రేపిన

'పుండు'కార్చిన సీరమే కనిపిస్తుంది.
కూర్చున్న నీ ఆసనం కేసి కళ్ళు తెరిచిచూడు
పాలకవర్గాల పరిరక్షణలో
ప్రతినిత్య ప్రయత్నంలో
దానికి మిగిలిన ప్రయాస, పరాధీనతలగుపిస్తాయి.
భానిసల తిరుగుబాటును అది సహించలేదు
భూస్వామ్య పతనాన్ని అదిభరించలేదు
ప్రజల కడుపులుకాల్చే ధనస్వాముల
పన్నాగాలు వమ్ము అవుతూవుండటం
దానికి ఇష్టం లేదు
బతుకుకోసం పోరాడుతాయి అన్నిప్రాణులు
ఉదయంకోసం ఆరాటపడ్తాయి అన్నిరాత్రిలు
విముక్తి కోసం యుద్ధంచేస్తాయి అన్నిజాతులు
అది నవ్యతనాహ్వానించిన ఛాయలు
చరిత్రలో మచ్చుకైనా కానరావు

నీ చుట్టూ సమాజం కేసి చూడు
రైతు జీవితంలో పస్తుల ప్రమాదం పెరిగివుంది.
కార్మికుని బతుకు ప్రతినిత్యం కరువులోవుంది
సైన్సు అభివృద్ధియైనా ఛాదస్తాలకు కరువులేదు
భానిస వ్యవస్థనాటి పెత్తందారీ తనం
నరబలి, కులం వెలి, మత దౌష్ట్యం
నిరాటంకంగా నిత్యకృత్యాల్లా సాగిపోతున్నాయి
సాలీడులాంటి ధనస్వామి సామాన్యుల్ని నంజుకొంటున్నాడు
భారతపౌరుని జీవితం భారీ యుద్ధంగా మారింది
ఝాంసి, నిర్మలలకు వారసులు కావలసిన మానినులు
బతుకుబాటకై బజారుపాలౌతున్నారు.
మేధావుల మెదడ్లోని బూజు 'చీకటి చిరకాలం వర్ధిల్లాలి' అంటోంది

చీకటిమయమైన ఈ వ్యవస్థా గహ్వరంలో
తూర్పు పవనపు తాకిడికి నివురు చెదిరిపోగా
అక్కడక్కడా వేగంగా రాజుకొంది నిప్పు

దేశప్రజల్ని పదికాలాలపాటు మోసం చేయాలని
సాయుధపోరు నుండి వాళ్ళను సుదూరంగా వుంచాలని
లెఫ్ఫోజ్‌కొట్టే రాజకీయ గుండాలు
సోషలిజం ముసుగును సొగసుగా ధరించాలని
తాపత్రియపడే దుర్మార్గనాటకమ్మన్యులు
రుణం చేసి రణంచేసే రాబందులు
భారత ప్రజల భుజాలపై భస్మాసుర నాట్యం చేస్తున్నారు.

కాని వీరతెలంగాణాను మరిపించడానికి చేసిన ప్రయత్నంలాగే
నగ్జల్‌బరీని అణిచే కుటిలయత్నం విఫలమైంది
తెలుగు గడ్డపై పోరును తుదముట్టించామని భ్రమించే
తుంటరుల జీవితాలకు నిద్రకరువైంది
ధనస్వామ్యం, దారిద్ర్యం, దోపిడీ, దౌర్జన్యం
పుచ్చిపోయిన సంక్షోభం నాశనం కానిదే సంక్షేమం రాజాలదు

సంక్షోభం సుస్థిరతకు శక్తికొద్దీ శ్రమించే మరలో
యిరుక్కొన్న మేధావీ,
అదిగదిగో అటుచూడు
జనత తీక్ష్ణ దృక్కులలో
ప్రభవిస్తూంది ప్రజాసైన్యం
చైర్మన్ మావో ఆలోచనతో
భారత విప్లవ పరిస్థితుల్లో
చెలరేగిన పోరాటక్రమంలో
శ్రమజీవి చేబూనిన ఆయుధం
వర్గశత్రు సంహారక యుద్ధం.

వర్గపోరుకు ఉన్నతరూపమై
గెరిల్లా పోరుకు నాందిని పలికి
నూత్న మానవుని జన్మ యివ్వగా
రూపు దాల్చిన పోరాటరూపం
వర్గశత్రు సంహారక యుద్ధం.

ఇది సైద్ధాంతిక త్యాగాల యుగం
శాస్త్రీయ బలిదానాల శకం
పిరికితనం క్రూరత్వానికి తల్లి
వజ్రిం వజ్రేన భిద్యతే
ఇది విప్లవాల యుగం
ఇది విశ్వవ్యాపిత సత్యం
ఇది చైర్మన్ మావో యుగం
అది చారిత్రిక పరిణామంలో పెరిగిన క్రమం
ఇది మావో ఆలోచనావిధాన యుగం
నేటి ప్రజ సామ్రాజ్యవాదాన్ని సమూలంగా
సమాధిచేయ సమాయత్తమైన
మార్క్సిస్టు-లెనినిస్టు తరం

ఇది భారత ప్రజల విముక్తి దశాబ్దం
ఇది చారు చూచిన భవిష్యత్ భౌతిక దృశ్యం.

కిరాయి మూకల సంరక్షణతో
ముసలినడక సాగించే పాలక యంత్రాంగానికి
సమీపించింది సంపూర్ణ పతనం
ప్రతిహింసాత్మక విప్లవంలోంచి
ప్రభవిస్తూంది నూత్న ప్రజాస్వామ్యం
ప్రజాపోరాటంలో వెల్లివిరుస్తున్నాయి ప్రజాకోర్టులు
ప్రజాకోర్టుల్లో ప్రజాచైతన్యం ప్రతిఫలిస్తుంది
ప్రజా పరిశీలన పరిమళిస్తుంది.

దారిద్ర్యాన్ని కేష్ చేసుకోవాలని తాపత్రియపడేవాళ్ళు,
దేశప్రజల్ని దౌర్జన్యంతో ఏలాలని ప్రయత్నించే వాళ్ళు
దొంగకరెన్సీతో మేడలు కట్టాలని తాపత్రియపడేవాళ్ళు
ప్రజాధనంతో పబ్బంగడుపుకోవాలని సంబరపడేవాళ్ళు
దోపిడీ మదగజాల నాశనం చేయగ వెడలే
విప్లవకిశోరాలను బంధించేవాళ్ళు
పాశవికంగా పరిమార్చడమే పరమావధిగా కలవాళ్ళు
ఎందరెందరో ఇంకెందరో ముద్దాయిలు
ప్రజాకోర్టు ఎదుట వీరందరు ముద్దాయిలు

చరిత్ర నిర్మాతల చేదోడుగ వుంటావా
మంచిని వాంఛించే మానవునిగ వుంటావా
చరిత్రహీనతయే చాలనుకొంటావా ?
సమాజంలో వున్న ఆర్థిక రాజకీయ
వ్యవస్థల ప్రతిబింబమే సంస్కృతి.

## కలలోపలి క్రాంతిసీమ

అరారా

ఆ సీమలో
యుగ యుగాల వర్గదోషంతో
మాసిపోయి మాసికలుపడ్డ గతచరిత్రని
నెత్తురుతో ఉతికి ఆరేస్తున్నారు—

మట్టికోసంకాక మనుషులకోసం జీవించే దేశభక్తితో
నిర్మించిన ఆయుధాల్ని ధరించి
ఆడపిల్లలూ పసిపిల్లలూ
భవిష్యదుజ్వల మానవతా సంస్కృతికోసం
తుపాకి గొట్టంద్వారా ఊపిరి పీలుస్తున్నారు—

పుట్టల్లోంచి బుసలు గొడుతూ పడగలెత్తుతున్న
బూర్జువా నీతినీ, బూర్జువా న్యాయాన్నీ, బూర్జువా దాహాన్నీ
తక్షణం పడగలు విరిచేసి
అహింసవి స్థాపిస్తున్నారు

ఆ సీమలో

ఆకాశంకేసి నిక్కిన ప్రొఫెసర్ల మెడలు
ఎర్రని పిడికిళ్ళతో సరిచేస్తున్నారు—
తలకాయలో ఒళ్ళుదాచుకున్న మేధావుల మెదళ్ళను
ఎర్రని నీళ్ళతో ఉతికి
రోడ్లమీద ఎండబెడుతున్నారు—

దోపిడి శక్తులెత్తిన హింసా శిరస్సుల్ని
నిర్దాక్షిణ్యంగా ఖండించి
సామ్యవాదపు కోట గుమ్మానికి
మాలలుగా వేలాడదీస్తున్నారు—

ప్రతి వ్యక్తి కండల్లో
కార్మిక రక్తాన్ని ఇంజక్ట్‌చేసి
నెత్తురు ధారపోసి నిర్మించుకుంటున్న
సంపూర్ణ కార్మిక రాజ్యావతరణ భూమి
అది నిజమైన కర్మభూమి!

దీర్ఘకాల సమరంలో
చీకటిమూకల్ని చీల్చి చెండాడి
అరుణ రక్తకాసారంలో వికసించిన వీరసూర్యుని
అక్షర కిరణాలు
ప్రతి వ్యక్తి గుండెగోడపై ప్రతిఫలించి
అనివార్యంగా రూపొందబోయే
రేపటి వెలుగుల లోకంలోకినడిపిన్తై

వర్గచైతన్యమే రక్తమాంసాలుగా
వర్గ ద్వేషమే ఊపిరిగా
వర్గ శత్రు నిర్మూలనమే పవిత్ర కర్తవ్యంగా
వర్గ రహిత స్వర్గ నిర్మాణమే అచంచల లక్ష్యంగా
సామ్యవాద హస్తాల్లోని అరుణాయుధంగా
అక్కడ చరిత్ర నూతన మానవుణ్ణి ప్రసవిస్తోంది—

అక్కడి కళలన్నీ
పెట్టుబడిదారీ విధానంమీద
కసితో జ్వలిస్తున్న తుపాకి రవ్వలు—
అశాంతికి మంటబెట్టి
శాశ్వతశాంతిని నిర్మించే సామాజికాయుధాలు—

ఆ సీమ
బూర్జువా సంస్కృతి ద్వేషంతో ఎర్రబడిన సూర్యుడు
నిరంతరంగా పరిశ్రమిస్తున్న
మహత్తర సామ్యవాద ప్రయోగశాల
అతని శోధనశాలికలో ఉదయించిన విజయానికి
చీకటిరాకాసితో చిరకాలపోరాటం సిద్ధాంతసూత్రం—
అదే ప్రపంచపీడిత జనసమూహానికి
అరుణోదయగీతం।

---



---

సమీక్ష:

# బందూక్

ఇదివరలో అనంతపురంనుంచి చైతన్య సాహితీపరులు "రక్తగానం" అనే కావ్య సంకలనాన్ని ప్రచురించారు. వెయ్యి కళ్లున్న దేవేంద్రుడిలాంటి "మన" ప్రభుత్వం వెంటనే దాన్ని నిషేధించింది.

ఈసారి వెలువడింది "బందూక్", అదే చైతన్య సాహితి ఆధ్వర్యంలో, ఇందులో కవిత్వంమాత్రమేకాక ఒక కార్మికుని "తొలిపలుకు", ఒక దార్శనికుని సిద్ధాంత వివేచన, అయిదుగురు నిబద్ధరచయితల ఆవేదనతో కూడుకొన్న ఆలోచనలాంటి అస్పష్టతకెక్కడా ఆస్కారంలేని వచన రచనలూ వున్నాయి. బహుశా ఈ సంపుటినికూడా ప్రజలకు అందనీయకుండా ప్రభుత్వంవారు నిషేధించవచ్చు. ఓ! ఇందుకు తగ్గంత పుష్కలమైన యంత్రాంగం వుంచుకొన్నదేకదా ఈ ప్రభుత్వం! మరి ఈయంత్రాంగాన్ని అవినీతి మీదకి, అజ్ఞానం మీదకి, నిరుద్యోగం మీదకి, నల్లడబ్బు మీదకీ, అనారోగ్యం మీదకి మళ్ళించదేంచేత ఈ ప్రభుత్వం? కారణం స్పష్టమే! ఇది ప్రజలకి ప్రాతినిధ్యం వహించే ప్రభుత్వం కాదు. ప్రజాపీడకులకు పరమాత్ముడు ప్రసాదించిన హక్కుల్ని చెక్కుచెదరనీయకుండా కాపలాకాచే ప్రభుత్వం ఇది.

సరిగ్గా ఈ హక్కుల్నే సవాల్ చేస్తోంది ఈనాటి యువతరం. దేశంలో తొంభై శాతం శ్రమజీవులమీద పదిశాతం పీడకవర్గం శాసిస్తున్న అధికారం ప్రజాస్వామ్యం ఎలా అవుతుంది? పాతికేళ్ళ రాజకీయ స్వాతంత్ర్యం ప్రజాసామాన్యానికి ఒరగబెట్టిందేమిటి? ఈ ఇరవయ్యయిదేళ్ళలో అక్కడా యిక్కడా అనకుండా దేశమంతటా దైవభక్తి, దారిద్ర్యం ఒకదానితో ఒకటి పోటీ పడుతూ పెరిగిపోతుండడానికి కారణమేమిటి? మనకన్నా ఆలస్యంగా స్వాతంత్ర్యాన్ని సాధించుకొన్న జనచైనాలో ఎలకలూ, ఈగలూ, దోమలూ, సుఖరోగాలూ, అన్నిరకాల దేవుళ్ళూ కలకానికైనా కనబడక పోవడమేమిటి? పైగా చైనాను మన శత్రువుగా చిత్రిస్తూ జాజ్వల్యమానమైన అచ్చటి సాంఘిక యదార్థాన్ని మన జనానీకానికి అందనియ్యకుండా అడ్డుపడుతున్న శక్తులేవి? ఆ శక్తుల్ని హతమార్చడానికి మంచిదారిలో మనుగడను మలచుకోవడానికి మనం అనుసరించాల్సిన మార్గం ఏమిటి?

ఈ ప్రశ్నలన్నింటికీ "బందూక్"లో చిత్తశుద్ధితోకూడిన తిరుగులేని సమాధానాలు మనకు లభిస్తాయి.

చైనా మార్గమే మన మార్గం!

– శ్రీ శ్రీ

---

బందూక్ (సాహితీ సంకలనం) వెల రు. 1-25

ప్రతులకు: 1. ముడార్ వేణు, కార్యదర్శి, చైతన్య సాహితి
14/400 కమలానగర్, అనంతపురం

2. సృజన, హనుమకొండ, వరంగల్ 506001

---

విప్లవ లేఖలు :

## కాళోజీ, కన్నీళ్ళను వర్గకసిగా పదనుపెట్టుకో

అది విశాఖపట్నం స్పెషల్ మెజిస్ట్రేట్ కోర్టు.

ఆరోజు మాపై పెట్టబడిన పార్వతీపురం నక్సలైట్ కుట్రకేసు క్రింది కోర్టు విచారణ చివరిరోజు. చట్టబద్ధంగా, రాజ్యాంగం ప్రకారం సారాపీపాలు కుమ్మరించి, దొంగనోట్లను వెదజల్లి, గుండాలను చూపించి ఎన్నికైన ప్రభుత్వాన్ని సాయుధపోరాటం ద్వారా కూలదోయడానికి కుట్ర పన్నామన్నది మామీద ఆరోపణ.

విచారణా తతంగాన్ని చూడటానికి ఎవరెవరో వచ్చారు. అందులో ఎవరో ఒక ముసలాయన వున్నారు. ఆయన తీరిగ్గా కూర్చొని అందరినీ పరిశీలిస్తున్నారు. నేను నెమ్మదిగా ఆయన పక్కన చేరాను. నెమ్మదిగా మాటల్లో పడ్డాం. ఆయన తన జీవితానుభవాలు చెబుతున్నారు.

"మీరు ఎప్పుడైనా జైలుకివచ్చారా ?" అని ప్రశ్నించా.

ఆనాడు బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా జరిగిన సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంలో రెండు-మూడు సార్లు, ఇటీవల ప్రత్యేక తెలంగాణా సందర్భంలో మరోసారి జైలుకి వచ్చినట్లు చెబుతూ, "ఆరోజుల్లో మేం జైలుకెళ్ళడం యిప్పుడూ ఒకటేనా ! ఆరోజుల్లో మమ్మల్ని అరెస్టుచేసినా ఎంతో గౌరవంగా చూచేవారు. కానీ నేడు వేరు. ఎందర్నో ఎన్నో చిత్రహింసలకు గురిచేస్తున్నారు. అరెస్టుచేసిన తరువాత రోజులతరబడి పోలీసు లాకప్‌లలో వుంచి ఎన్నో దారుణాలకు ఒడిగడుతున్నారు. నేను ప్రత్యేక తెలంగాణా సందర్భంగా జైల్లోవున్నప్పుడు కామ్రేడ్ ఐలయ్యను(కుట్ర కేసులో ఒక నిందితుడు) అరెస్టుచేసి 51 రోజులపాటు పోలీసులు తమ నిర్బంధంలో వుంచుకొని 52వ రోజున యీరోజే అరెస్టుచేశామంటూ కోర్టులో పెట్టారు. ఈరోజున యిలాంటి వాటికి అంతేలేదు. మా వయస్సయిపోయింది. మా వంట్లో సత్తువ పోయింది. కానీ మాకొక తృప్తి మాత్రం వుంది. మా పిల్లలైన మీరు మా ఆశయాలు కొనసాగిస్తున్నారని, ఆ గర్వంతోనే మేం బతుకుతున్నాం." అంటూ కళ్ళల్లో నీరుపెట్టు కున్నారు. ("పోరాటం మధ్యలో అంతులేని కన్నీళ్ళకు అస్కారం లేదు సుమా !")

మా యిద్దరిమధ్యా కొంచెంసేపు నిశ్శబ్దం తరువాత నేను మరోప్రశ్న వేశా. "మార్క్సిజాన్ని సామాన్యమైన కార్మికులకూ, కర్షకులకూ అర్థమయ్యేలా తేలికభాషలో అందించడానికి మీరెందుకు ప్రయత్నించకూడదు ?"

వెంటనే ఆయన యిలా అన్నారు. "మార్క్సిజం ఒక శాస్త్రీయమైన సిద్ధాంతం. దాన్ని ప్రజలకు అందించాలంటే, ముందుగా దాన్ని నేను బాగా జీర్ణంచేసుకోగలగాలి. రెండవది నేను కవిని. ముందుకెళ్తున్న జనాన్నిచూచి తన్మయత్వంతో నేను కవితను ఆలపిస్తాను. సత్యాన్ని సత్యమని, న్యాయాన్ని న్యాయమని సమర్థిస్తూ కవితరూపంలో గానం చేస్తాను. నాపని ఇది"...ఆయన ఉత్తరీయంతో కళ్లొత్తుకుంటూ ఇంకా ఇలా అన్నారు "పాలకవర్గాలూ వారి తాబేదారులూ ప్రచారంచేస్తున్నట్లు మీరు చేసేది హింస కాదని, అది పాలకవర్గాలు చేస్తున్న హింసను అంతంచెయ్యడానికి ప్రజలు ప్రయోగించే ప్రతిహింసఅనీ, దాన్ని నేను సమర్థిస్తాను. మీరు చేస్తున్నది తప్పుకాదు. పాలక వర్గాలు చేసేది హింస. ఆ హింస నెదుర్కొని దాన్ని అంతం చెయ్యడానికి చేసేది ప్రతిహింస. ప్రతిహింస తప్పుగాదు."

"హిరణ్యకశిపుడు తన కుమారుడైన ప్రహ్లాదుడిని అతనిసిద్ధాంతం వదలుకొమ్మని శాసించాడు. లేదు, నా ప్రాణం పోయినా నా సిద్ధాంతం వదలనన్నాడు ప్రహ్లాదుడు. దానితో పిచ్చిపట్టిన హిరణ్యకశిపుడు ప్రహ్లాదుడిని ఎన్నో చిత్రహింసలకు గురిచేశాడు. అంటే ప్రహ్లాదునిపై హింస ప్రయోగించాడు. ప్రహ్లాదుడు సత్యాగ్రహంలాంటిది చేశాడు. ఫలితం శూన్యం. ఆ సత్యాగ్రహంతో సమస్య పరిష్కారమయితే పరవా లేదు. కానీ అది సాధ్యంకాదు, దానికీ మార్గం ఒకటే. ఆ హింసను ఎదుర్కోవడం. ఆ పనిని వుగ్రనరసింహుడు పూర్తిచేశాడు. నరసింహుడు చేసింది హింసకాదు ప్రతి హింస. అందుకే ప్రతిహింస చెడ్డదికాదు. పైగా అనివార్యంకూడా. ప్రస్తుతం యీ ప్రభుత్వం విశాల ప్రజానీకంపై చేస్తున్న హింసకు వ్యతిరేకంగా మీరు ప్రతిహింస చేస్తున్నారు. అది సమంజసమైనది. అందుకే నేను దాన్ని సమర్థిస్తాను. నేనుచెప్పేది ఒకటే. మాలాంటివాళ్ళం చెయ్యడానికి ఓపికా-సాహసం లేకపోతే ప్రక్కనవుంటాం. న్యాయాన్ని న్యాయమని చెబుతాం. సరయినదాన్ని సరయినదని చెబుతాం. అంతేగాని మాలో లేని ఓపికా, సాహసాలను కప్పిపెట్టుకోడానికి మాటలగారడీతో అంతా తప్పని అడ్డుపడం. ముందుకెళ్ళేవారిని ఆపివేయడానికీ, అడ్డు పడడానికీ ప్రయత్నించం."

ఆయన వుద్రేకాన్నిచూస్తే ఆయన "ఎముకలుకుళ్ళిన వయస్సుముళ్ళిన సోమరి"లా కాకుండా "అలజడి మా జీవితం, ఆందోళన మా వూపిరి, తిరుగుబాటు మా వేదాంతం" అని సగర్వంగా చెప్పుకోగలిగిన మహా మనీషిలా కనిపించారు.

ఆయనతో నా పరిచయానికి ప్రారంభం యిదే.

ఆయన ఎవరో తెలుసా? ఆయనే మన కాళోజీ

ప్రియమైన కాళోజీ! కృతజ్ఞుణ్ణి.

— పార్వతీపురం నక్సలైటు కుట్రకేసులో
ఒక నిందితుడైన రైల్వే కార్మికుడు.

## విప్లవ రచయితలపై లాఠీచార్జ్ - విరసం కార్యదర్శి ఖండన

ఆగస్టు 24 వ తేదీన అధికధరల వ్యతిరేక ప్రదర్శనలో విద్యార్థి, ఉద్యోగ, రచయితల ఐక్యత వర్ధిల్లాలి అనే ఆశయంతో వరంగల్ విప్లవ రచయితల సంఘం శాఖ పాల్గొన్నది. ఊరేగింపు సాగుతుండగా కాంగ్రెసు జెండాలు పట్టుకొని కొందరు గూండాలు ప్రదర్శనలో చేరటానికి ప్రయత్నించారు. అధికధరలకు కారణమైన పార్టీ జెండాను ఊరేగింపులో ప్రవేశపెట్టటానికి ప్రదర్శకులు వ్యతిరేకించారు. కాంగ్రెసు గూండాల ప్రోత్సాహంతో కుట్రతో కలక్టర్ ఆఫీసుకు పదిగజాలదూరంలో ప్రదర్శకుల మీద లాఠీచార్జి చేయించారు. విప్లవ రచయితలు వరవరరావు, రంగారావుగార్లకు గాయాలు తగిలాయి. విద్యార్థి నాయకులు భుజంగరావు, రవీందర్‌లు స్పృహతప్పి పడిపోయారు. కాజీపేట స్టేషన్‌లో లాకప్పులోవుంచిన విప్లవ రచయితలను విద్యార్థి నాయకులను ప్రజలే విడిపించుకున్నారు. అధిక ధరలకు కారణమైనవర్గమే అధికధరల వ్యతిరేక వుద్యమంలో పాల్గొని చేస్తున్న ప్రజావంచన ఈ సంఘటనవల్ల బట్టబయలయింది. కాంగ్రెసు అదృశ్యహస్తాన్ని వరంగల్‌ప్రజలు నగ్నం చేశారు. నయారివిజనిస్టులైన మార్క్సిస్టు పార్టీవాళ్లు వల్లించే కాంగ్రెసు వ్యతిరేకత బూటకపు ముసుగని తేలిపోయింది. దోపిడీవర్గాల పాదాలదగ్గర ఎర్ర జెండాను పణం పెడుతున్న ప్రజాద్రోహులకు బుద్ధిచెప్పవలసిందిగా వివిధ కార్మిక విద్యార్థి సంఘాలను కోరుతున్నాను. విప్లవ రచయితలమీద, విద్యార్థులమీద జరిగిన అమానుషమైన లాఠీచార్జ్‌ని నిరసిస్తున్నాను. కాంగ్రెసు గూండాల చేతుల్లో ఆయుధాలుగా వ్యవహరిస్తున్న పోలీసుల జులుంను ఎదుర్కోవలసిందిగా ప్రజాస్వామ్య ప్రగతిశీల సంస్థలకు విజ్ఞప్తి చేస్తున్నాను.

కార్మిక, కర్షక, ఉద్యోగి, విద్యార్థి, రచయితల సంఘటిత శక్తి వర్ధిల్లాలి.
విప్లవం వర్ధిల్లాలి.

– త్రిపురనేని మధుసూదనరావు
కార్యదర్శి, విరసం

---

## ప్రాథమిక హక్కుల్ని ప్రజలు కాపాడుకోవాలి

అధికధరలకు వ్యతిరేకంగ 24-8-'73 రోజు హనుమకొండలో కలెక్టరాఫీసుకు ఊరేగింపుగా వెళ్ళిన ప్రజలపై పోలీసులు చేసిన లాఠీచార్జ్‌ను మేం ఖండిస్తున్నాం. ముందు హెచ్చరిక ఏమీలేకుండానే, పోలీసులు లాఠీచార్జ్ చేసారు. పోలీసులు శ్రీయుతులు వరవరరావు (సంపాదకుడు, సృజన), డాక్టర్ అట్లూరి రంగారావు (విరసం), భుజంగరావు, రవీందర్ (విద్యార్థినాయకులు)లను ప్రత్యేకంగా ఏరిఏరి కొట్టారు. ధరలను అరికట్టలేని ప్రభుత్వం, ప్రజలు ఆకలితో ఆందోళన చేసినపుడు పాశవికంగా అణచివేస్తున్నది. అందుకని 24 ఆగస్ట్ రోజు హనుమకొండలో పోలీసులు జరిపిన దమనకాండపై న్యాయవిచారణ జరిపించి దానికి బాధ్యులైనవారిని శిక్షించాలని డిమాండ్ చేస్తున్నాం. లేకపోతే ప్రజాస్వామ్యాన్ని, ప్రాథమిక హక్కులను శవపేటికలో భద్రపరిచినవారమే అవుతామని రాజ్యాంగంద్వారా రక్షించిన వాళ్ళం మాత్రం కాజాలం.

పత్తిపాటి వెంకటేశ్వర్లు
కన్వీనర్
పౌరహక్కుల సంఘం,
హైదరాబాదు.

---

## చిన్న కథల సంకలనం

హైదరాబాదు విరసం యూనిట్ చిన్న కథల సంకలనం ఒకటి తేవాలని నిర్ణయించింది. కథ ఫుల్‌స్కేప్ సైజులో నాలుగు పేజీలకు మించకుండా ఉండాలి. ప్రతి కథ విప్లవాత్మకంగా సమకాలీన సాయుధ పోరాటాల ప్రతిబింబంగా ఉండాలి. యూనిట్ విరాళాలు స్వీకరిస్తుంది. కథలు, విరాళాలు సెప్టెంబరు పదిహేను లోపల ఈ క్రింది అడ్రసుకు పంపవలసిందిగా కోరుతున్నాం.

చెరబండరాజు
2-2-982, అంబరుపేట
హైదరాబాదు - 500013

## తూరుపు

సమకాలీన పరిస్థితులు
చిత్రించే కథలతో
ఒక సంకలనం తేవాలని సంకల్పం
రచయితలు
తమ అముద్రిత కథలు పంపించి
సహకరించ కోరుతున్నాం.
నవంబరు ఒకటో తేదీలోగా కథలు అందాలి.

వివరాలకు : శ్రీపతి
3-4-488/1 లింగంపల్లి,
హైదరాబాద్ - 500027.

---

## విప్లవ నాటికలు

విప్లవ రచయితల సంఘం విప్లవ నాటికల సంకలనాన్ని ప్రచురించటానికి నిర్ణయించింది. ప్రజా పోరాటాలను ప్రతిబింబిస్తూ విప్లవ సిద్ధాంత చైతన్యంతో నిండిన, ప్రదర్శనకు అనువైన నాటికలను రచయితల నుండి ఆహ్వానిస్తున్నాం— నవంబరు 15వ తారీఖు నాటికి రచయితలు ఈ క్రింది చిరునామాకు తమ రచనలు పంపవచ్చును.

త్రిపురనేని మధుసూదనరావు
కార్యదర్శి, వి.ర.సం.
7-రామానగర్
తిరుపతి - 517501.

అక్టోబర్ 1 కి

వెలువడుతున్నది

# విమోచన

రాజకీయ పక్షపత్రిక

ఈ సంచికలో,

* భారత చైనాలలో గ్రామీణ పునర్నిర్మాణం
(ఒక తులనాత్మక అధ్యయనం)
* భారత దేశం సర్వవ్యాపిత సంక్షోభం.
* నల్లగొండ జిల్లా పౌరహక్కుల సభల రిపోర్టు
* నిబద్ధత-నిమగ్నత
(విరసం కు నిజామాబాదు అభ్యుదయ విద్యార్థుల లేఖ)

ఇంకా ఇతర వ్యాసాలు, వార్తలు, వ్యాఖ్యలు, గేయాలు ఉంటాయి.



విప్లవకవులు- రచయితలు, మేధావులు, యువకులు, కార్మిక కర్షక మిలిటెంట్ ఉద్యమాల్లో అగ్రగాములుగాఉండే కార్యకర్తలకూ మావిజ్ఞప్తి

ప్రజల నిత్యజీవితంలో కలిసిపోయి, వారిని ప్రభావితంచేసే రచనలను జానపద కళారూపాల్లో ఉద్యమంగా తీసుకరాండి. మాకు పంపించండి.

రోజువారీ పీడననూ దౌర్జన్యాన్నీ వొంటరిగా ఎదుర్కోవడంకాదు. మీ పోరాటానుభవాల్నీ, సమస్యల్నీ మాకు రాయడం ద్వారా ప్రజల ముందుంచండి.

శాస్త్రీయ, సైద్ధాంతిక అధ్యయనానికి తోడ్పడే వ్యాసాలురాసిపంపండి.

విమోచన సాలు చందా 10 రూ॥లు

అడ్రస్ : 3-9-117, కుమార్‌పల్లి హనుమకొండ,
వరంగల్ 506001.

SRJANA Telugu Monthly Sept. '73 H-1088
Regd. No. with Registrar of News Papers 10953/67



SRJANA
HANAMKONDA
Warangal 506001

1 Re.